# లైసన్సుమొగుడు

రచయిత:

మల్లాది లక్ష్మీనరసింహశాస్త్రిగారు.



పబ్లిషర్:

కందుల గోవిందం

జనరల్ బుక్ డిపో, రాజమండ్రి.

1945

కాపీరైట్ ]

[వెల 0-8-0

# మనవి.

పాఠకులారా !

మన దేశంలో పాశ్చాత్య నాగరికతా బీజం మొలకలెత్తి చివరకు పూచి, కాచి, పండి, నంగి జనజీవలాడుతూందంటే నమ్ముతారా? నమ్మరా? పెళ్ళిళ్లు ఎన్నిరకాలుగా కొత్తఫక్కీల్లో జరుగుతున్నాయంటారు? వర్ణాంతర వివాహాలందులో ఎన్నోవంతు? దానివల్లవచ్చే అనర్థకాలేవిటి? లాభాలేవిటి? వాటినే చర్చిస్తూ— అల్లాజరిగిన ఓపెళ్ళికొడుకుని "లైసన్సు మగడు" అన్నాము. లోగడ- 'ఆకతాయి మగడు' అనే నవల చదివి కొందరాడాళ్లు- ఆనందబాష్పాలు రాలిస్తే మగాళ్లు భుజాలు తడుముకొన్నారుట. ఇప్పుడీ లైసన్సుమగడు చదివి ఆడంగులూ— మగంగులూ— ఏమంటారో చూడాలి ???

ఇట్లు

రచయిత.

శ్రీనివాసా ప్రెస్, రాజమండ్రి. సెప్టెంబరు 1945—1000

౧

"ఇంతవిస్తారం ఎక్కడేనా వుందిటండీ"

"ఇప్పుడేం విస్తారంవొచ్చి కొంపమునిగిందేమిటి?"

"ఊళ్ళో కొంపలు కాలుతున్నా మీకేం తెలియనట్టుంటారు!"

"నాసంగతే అంత—గాని అసలుసంగతేమిటో చెప్పా,

'నానోటమ్మటే చెప్పిద్దామనా?'

"సంగతి చూచాయగానేనా తెలియకపోతే ఎలాగంట,

'తెలివితక్కువదాన్నైతే మళ్ళీ ఆడిస్తురు'

'ఆమాటనుకునే గాడిదెవడూ?'

"మాటవరస కన్నాను—మీ నోరణ్గావుందిలెండి'

'మళ్ళా మొదట కొచ్చావు"

"అలా వచ్చేటట్టుచేసారు"

"ఇప్పు డింతకీ నువ్వనేదేమిటి?"

నానోటిమీదేరా వాలనిగాదూ? ఈగూడుపుఠానీ'

'గూడుపుఠాణీ ఎవరితోటి'

"మీలో మీరే అంతా స్వయంపాకం"

"నీలో నువ్వే !ఖంగారు పడుతున్నావు. కాళ్ళువిరగదొక్కుకుంటావు? మళ్ళీనిలబాటుచేసుకుంటున్నావు. అసలుసంగతి తేల్చా"

'తేల్చేటుగా చేస్తానా?'

'నేను నీముందెంత,

ఆ! అమగో ప్రారంభమౌతోంది ఉడుకుమోత్తనం'

'నాకెందుకని ఉడుకుమోత్తనం'

"నానోటంట పలకలేదని'

# లైసెన్సు మగడు

"తట్టుకున్న పట్టుదల అదేకాదూ!"

'ఫలానావిషయం అల్లాంటిదీఅంటే ఆలోచనేనా చేద్దును!'

'నీతలకాయలో చిన్నతెగులు అదేమోకా—నాకేం పట్టుదల లేదు'

"పట్టుదల కాకపోతే తెలుసుండీ నన్ను బూకరించడమేమిటీ?

'ఆ తెలుసుండీ దేమిటో విసరంత వయస్సికి రానిద్దూ"

'నా మొహం ఏం రానిస్తాను"

"లేకపోతే కట్టిపెట్టి పడుకో"

"చేతగాకపోతే అంతేగదూ!'

'సంగతేమిటో తేల్చవు? చాయలేనా రానివ్వవు; విడ్డూరం—విడ్డూరం అంటే—అన్నీ విడ్డూరాలే"

"అన్ని విడ్డూరాలు తెలుసుండి యింటో విడ్డూరం తెలియదా ఏమిటి?'

'అదే అనద్దన్నాను?'

'మఱి ఏమ్మనమంటారు?'

"పలానా విడ్డూరం అని అనకూడదూ"

"అమ్మాయి చేసేవిడ్డూరం'

'ఏమిటది?"

"అలాగే అనద్దన్నాను"

"మాటకి మాట బదులుతీర్చావు. అంతే దానికోసందర్భం లేదు.

"సందర్భాలెల్లా తెలుస్తాయి చదుకోని వెఱ్ఱిపీనుక్కి?.

"చదువుకున్న వాళ్ళకి నీకన్న ఎక్కువ తెలుసా యేమిటి?"

'వాళ్ళముందర నాయాలోచనలు పనికొస్తాయా?

"పనికిరావని యెవరన్నారు'

"ఒకరనాలా ఏమిటి?"

"అనకపోతే ఇవన్నీ ఎందుకు?"

'అసలు నాకెందుకీగొడవ-- తెలివితక్కువదాన్ని గాకపోతే"

'వటిఅసలు ఎందుకెత్తావు—అసందర్భంగా'

సందర్భంగావుండి సందర్భమైన సమాధానం, సందర్భంగా చెపుతారేమో అని సందర్భంగా ఎత్తాను'

ఇన్ని సందర్భాలతో నిండివున్నది అసందర్భంగామాత్రం దేమో. సందర్భాలు కలియక—తెలియక"

'అంతేనా ఇన్ని సందర్భాలు ఒకదాంట్లో ఇమడకా?"

"చదువుకున్నవాళ్ళకి ఎన్నో సందర్భాలు లోక సందర్భంలో ఇముడుతాయి.'

'ఇముడ్చుకునే తెలివుంటే అందరికీ అంతే"

'ఇమడనివ్వద్దూ?'

"సందుచేసుకొని యినడాలి'

'సందుచేసుకునే తెలివి వుండొద్దూ?'

"అది లేకపోతే కొనుక్కోవాలి'

'చదువుకొనేవాళ్ళు పుస్తకాలు కొనుక్కున్నట్లే తెలివి కూడా కొనుక్కుంటారు కాబోలు బజార్లో"

"నీకాసంగతెలియదు కాబోలు—పప్పులో అడుగేస్తున్నావు,

"పప్పులో అడుగు ఇప్పుడెయ్యాడవేం.

'ఎప్పుడో వేసావన్నమాట"

"ఏనాడైతే యీ యింటో అడుగెట్టానో ఆనాడే

"ఎంతవరకు జారావు"

'చెప్పాలా—అధోలోకానికి ఆరామడవరకు—

"పాపం ఎంతదీనదశలోవుండీ దైన్యం అనుభవిస్తున్నావు'

'కాకపోతే నేననుభవించి ఆ ఘూంటచేసుఖాలెమిటి?'

"ఇప్పుడు నీకొచ్చిన లోటేమిటీ?"

"ఆడదానిలోటు మగాడి కెల్లా తెలుస్తుంది"

'సిగ్గూలజ్జావున్న ఏఆడదీ అల్లా చెప్పుకోనదు"

సిగ్గూ లజ్జావున్న ఆడదల్లా పడకటింటో అర్ధరాత్రివేళ— అపరాత్రిసమయంలో— మంచంనమెక్కి కూర్చుని— మాటకి మాట సమాధానంచెపుతూ— భర్తకి నిద్రాభంగం కలిగించి—తాను నిద్రపోకుండా—ప్రసంగిస్తుందా!'

"ఎంతకాలమని ఓపిక పడుతుంది'

"కొంతకాలం ఓపికపట్టి తర్వాత సిగ్గూలజ్జా విడిచేస్తుందన్న మాట.'

'స్త్రీయొక్క ప్రకృతి మీకు తెలియదల్లావుంది,

'అబ్బే నాకు స్త్రీప్రకృతి తెలియదు—ఆడదాని మొహం తెలియదు,

'మీకాడదాని మొహం తెలియదని నేననడంలేదు'

"నువ్వనేదేమిటి? విద్దూరం— చదువుకోడం— సిగ్గూ లజ్జా— ప్రకృతి ఇంతేనా?,

'మీయిష్టంవచ్చినట్టు మీరనుకోండి— నాయిష్టంవచ్చినట్టు నేనహోరిస్తాను.

'ఏంతేనా అందంగావుంది అర్ధరాత్రివేళ నిదట్లోలేపి కజ్జా పెట్టి దాన్ని పెంచి ఫెళఫెళ ధ్వనులు కలిగిస్తున్నావు'

ఎన్నికలిగించినా ఫలితంలేదుగా'

'ఫలితంలేక పోవడమేమి? అంతా నిదానంలో వుంది,

"ఆడదానుని కాదీ—అంతం—వుండొద్దా,

'తెగతెంపులు చేసుకొని ఇది ఆది, ఇది అంతం, అనుపించు కోవాలి.

'అంతవఱకు నాకు తెలివిలేకపోయింది''

"ముందైనా జాగ్రత్తపడు''

'అల్లాగేలెండి. నాపూర్వజన్మ ప్రారబ్ధానికి మీరేంజేస్తారు. నేనేనాడో చేసుకున్న మహాపాపం- అనుభవిస్తున్నాను. ఇల్లాంటి కాపరాలు చెయ్యడంకన్న రాయికట్టుకొని నూతిలో ఉఱకడము మంచిది'

"ఉరికేవాళ్ళని ఎవరాపగలరు!

'ఎవ్వాళ్ళ కేవంత అవసరం''

"అవసరంకలిగేటట్టుగా నడుస్తే అంతా అవసరమే'

"నడవడానికోమార్గం వుండాలి''

'మనసుకుదురుతే అన్నీ మార్గాలే'

"అదే చాలాదూరంగా కనుపిస్తోంది'

'అది దూరమైతే అంతా దూరమే''

'పెండరాడే అతిదూరమైతే ఆనందంగానే వుంటుండండరికీ,

'ఆనందాన్ని ఏదో విధంగా కోరనిదెవరు-''

"అంతాకోరుతారు. ఆనందం లభించవద్దూ''

"దానికెంత అదృష్టం వుండాలి'

"అదృష్టం బుజ్జగించే రాబట్టుకునేది కాదు'

'దానంతటదేవస్తుందన్న మాట''

"ప్రాప్తలాభం—''

'చాలా ఆయాసపడ్డావు. పడుకో''

'తమకి చాలా శ్రమకలిగించాను'

'నువ్వు అర్ధరాత్రివేళ్లెంతో నీరస పడ్డావు''

"ఇల్లాటి ఎన్నినీరసాలు జీర్ణించాయో''

'చాలా ఉద్ధండురాలివి.'

"తమదయ"
'నానయేముందీ! గుడ్డికన్ను మూస్తే ఎంత— తెరుస్తే ఎంత—
'అలాఅనకండి. దేవతలాలకిస్తారు"
"నన్ను దేవలోకంలోకి గెంటేశావు'
'నానోటితో ఏమన్నా అపరాధంక్రింద వస్తుంది!'
"ఆలాగని ఊరుకుంటావా'
"ఊరికోక ఏంజెయ్యనూ'
"అర్థరాత్రివేళ యింతరాద్ధాంతం దేనికి అని"
'నాఖర్మంగాని మరోటికదూ!'

అని కళ్ళివెంట నీరుకారుస్తూ మగడు బాగాచూస్తున్నాడో లేదో అని ముఖం బాగావత్తి కనుబొమలు బాగాముడిచి ఏడుపు పెట్టవలసిన ఫోజులన్నీ పెట్టి ఎదటమనిషికి జాలికలిగేటట్టుగా గుటకలుమింగుతో అంగట్లో గొడుగుతూ చొల్లు వగైరాలతో తలగడా అంతా తడిపేసింది రేణుక. ఆమె తన సర్వశక్తులూ ఉపయోగించి చేసినరోదన యజ్ఞానికి తలగడా ఒక్కమూల బెత్తెడు మేరతడిసిన కన్నీటి అవబృధస్నానం ముగిసేటప్పటికల్లా ఫలితం కనిపించి, ఆమె భర్తయైన బ్రహ్మయ్య చరచర తనమంచం మీదనుం చురికి ఆమె మంచంమీదికెళ్ళి తలగడా మొదట తుడిచి చూచి తర్వాత ఆవిడకళ్లుతడివి. క్రిమంగా తడవవలసినప్రదేశాలన్నీ తడివి అప్పుడు రేణుకా! ఇంతేనా నీతెలివంతా! ఈమాత్రానికే కడవెడునీరు కార్చాలా! అని తన తువ్వాలుచెంగుతో కాస్సేపూ, ఆవిడ పైట చెంగుతో కాస్సేపూ కళ్ళువొత్తి, చాల్లే! పడుకో. మనమిద్దరమూ లేచిన వేళావిశేషం మంచిదికాదు. అంచేత ఇంతవరకూ వచ్చిందని బుజ్జగింప బోయాడు.

నన్నేం బుచ్చగించనక్కరలేదు— నాకర్మం ఇలావుంటే అలా ఎందుకు జరుగుతుందీ అని మళ్లా ననగడం మొదలెట్టింది.

ఆమె నసిగినకొద్దీ అతను ప్రేమలాడడం మొదలెట్టాడు. కాళ్లా వేళ్లా పడ్డాడు. చీదరించుకుంది. చేతులు విదిలించింది. తోసేసింది అతడు వదిలిపెట్టలేదు.

నన్నింతగా చచ్చుపీనుగునిచేసి నానామాటలూ అని మళ్ళీ బుజ్జగింపులు చేసినీ.

నిన్నేమైనా కానిమాటలన్నానా? తూలనాడానా ఇప్పుడు కా దెప్పుడైనా.

"ఇందాకటినుంచీ నేచేసిన దంతా హసనీ.'

'నువ్వు. అసలు సంగతేమిటో చెప్పకుండా నన్ను నలిపి చంపేశావు'

'అసలు సంగతులు మింకు పూర్తిగా తెలుసునని నానమ్మకం"

"నీవు ఏవొట్టుపెట్టుకోమంటే ఆవొట్లు పెట్టుకుంటాను."

'మీరు వొట్టుపెట్టుకోనక్కరలేదు. మీకు తెలుసునసే నే నభిప్రాయపడి మీతో వాదన పెట్టుకొన్నాను."

'తెలిసివుంటే నీకన్నా నాకు ఇతరాప్తులెవరున్నారనిదాస్తాను"

'మీరు దాస్తున్నారని నామీద ప్రేమలేదనీకాదు. 'నాకు తెలిస్తే నేనేదో అడ్డంవస్తానని భయపడి చెప్పడంలేదని అభిప్రాయపడ్డానంతే-

'అల్లాటిదేమిలేదు. అంతాసక్రృచ్ఛంగానే చెపతాను. గలానా అనీ అడుగు"

"మనశకుంతల యిప్పటివరకూ పెళ్ళిచేసుకోకపోవడమే బాగా లేదు. అందులోను ఇప్పుడు నవ్యసాహిత్య పరిషత్తులో మెంబరైన క్రైస్తవుణ్ని అతనిపేరదో తమాషాగా వుంటుంది అతనిని__ ఆ జ్ఞాపకం వచ్చింది—'మోసెస్'ను వలచిందట. మనమెంత నాయుళ్ళమైనా ఇంతకాలం పిల్లని అట్టేపెట్టకూడదు. అదే పొరపాటు. అందులోను క్రైస్తవుణ్ని పెళ్ళాడిందంటే మనకేమైనా సాటివారిలో?

గౌరవమర్యాదలుంటాయా? అతడస్తమానమూ మనింటికివచ్చి ఆ కూని దీర్ఘాలేమిటి!? ఆపాటలేమిటి వెంగిపాటలు, గంగిపాటలను రంగిపాటలు— ఇవంతా చాలా విడూరంగా ఇరుగుపొరుగు వాళ్ళు చెప్పుకుంటున్నారు. నువ్వేనా శాస్త్ర మందలించవమ్మా అని పోట్లు పొడుస్తున్నారు. మీకు తెలిసే వూరుకున్నారని నేననుకున్నాను. నేను చెప్పితే నన్నే పల్లెటూరిమనిషికింద కట్టి లక్ష్యంచేయక పైగా నువ్వు పల్లెటూరి పశువు అనికూడా అంటుంది పైకి వినబడకుండా.

"ఇవంతా నాకేమీ తెలియదు! నేనుండగా యీసారి అతగాడువస్తే ఎలాచెప్పాలో అలాచెప్తాను. నువ్వుకూడా ఒకసారి అమ్మాయితో చెప్పు?

నేను చెపతాను. లక్ష్యపెట్టదు. పైగా ఏదో కల్పించి మీతో చాటుగా చెపుతుంది. నేనేదో దాన్ని కోపిపెడుతున్నానని మనస్సుకు కష్టంకోస్తుందని నోరు నొక్కుకుంటున్నాను,

"ఇల్లాంటివిషయాల్లో ఉపేక్షకూడదు,

మీకు నేను మూడేళ్ళకిందటే చెప్పాను. కాలేజీలో ప్రవేశపెట్టొద్దు. వచ్చిందేదో వచ్చింది. ఈపాటి కెక్కడేనా తగినవాణ్ని చూసి పెళ్లిచేద్దామని— మీరూ వినలేదు.

'పోనీ, సరదా పడుతూంది. బి, యే, ప్యాసయ్యేవరకు దాని యిష్టమే జరుపుదాం— ఒక్కపిల్ల— అని వూరుకున్నానుగాని— నేనప్పుడే ససేమిరా అంటే ఆగిపోయేదే'

అని రేణుక, ఆమెభర్తయైన బ్రహ్మయ్యా రాత్రి పడకగదిలో కూతుర్ని గురించి మాటలాడుకుంటున్నారు. ఆమాటల్ని ఆపడకగదిలోని పటాలు, అద్దాల బీరువా, ఇనప్పెట్టెతప్ప యింకెవరూ వినటంలేదనే ఊహాలో బిగ్గరగా కాకుండా కొంచం స్థాయితగ్గించి మాటలాడడం పక్కగదిలోనే వసుచరిత్ర విమర్శన చదువుతో

వరూథినీ శృంగార హాసభావాల ఉచితానుచితాలను చర్చచేస్తూ అనేక విధాలుగా భావపరంపరలతో తూగులాడే శకుంతల ఆది నుండి అంతంవరకూ ఆసవతి తల్లి తండ్రిమాటలాడుకునే ప్రతీ అక్షరంవింది. తన్ను గురించేకదామాటలాడుకుంటున్నారని రెండు గదులకూ మధ్యగావున్న తలుపు సగ్గాగావచ్చివింది. ఒకమాటు తల ఊపింది—ఆపళ్లెటూరి పడుచువలలో తనతండ్రి పడిపోయి చెప్పిన దానికల్లా గంగిరెద్దుమాదిరిగా స్తరుతలాడించి తన ప్రణయసామ్రాజ్య వినాశనానికి నడుము కట్టుకోబోతున్నారని గ్రహించింది—ఇంతట్లో పీరు చేసేదేముందికనక- ఎప్పటికప్పుడేఆలోచనచేసి పీరిని తనమార్గాని కడ్డురాకుండా చేసుకోవచ్చును. ఇంతచదువు చదివి వీళ్ళని బుట్టలో పెట్టలేనా అనుకుంటూ తిరిగి తనచదువుప్రక్రియలోపడి కొంతసేపటికి నిద్రాదేవి కౌగిళ్లలో ఒరిగిపోయింది.

---

## ౨

బ్రహ్మయ్య కాపురస్థలం కాకినాడ. ఆతనిపూర్వీకులు కూలి నాలి చేసుకోవడానికి కాకినాడొచ్చి క్రమేణ తోట్టిపడవలవ్యాపారం సాగించి శుక్లపక్షంలో చంద్రుడల్లా దినదినాభివృద్ధిపొంది తుదకు ఓడల్లోకి సరుకులు వేయించే మొగుమతీదిగుమతీ సరకులకు కంట్రాక్టర్లయి బాగా డబ్బు ఆర్జించారు. కాని వారేవో కొన్ని ఘాతుక కృత్యాలు చెయ్యడంవలన అన్నదమ్ములందఱూ నశించిపోయి, ఆస్తి చాలావఱకు పరారీ ఐపోయి తుదకు 2, 3, లకారాల విలువ చేసే స్థిరచరాలు, బ్రహ్మయ్య మిగిలారుట. బ్రహ్మయ్య మిక్లారన్ హైస్కూలులో డింకీలు కొట్టికొట్టి 4వ ఫారం అనిపించుకున్నాడు. ఇంతలో తల్లిదండ్రులు కాలంజేసారు. గృహయాజమాన్య వహిం

చి ఆఫ్రికానేవున్న పల్లెటూర్లో పలుకుబడిగల పెద్దరైతుకూతుర్ని పెళ్ళాడి వెనకటి మోతుబరీ వ్యాపారాన్ని ఆసరాచేసుకుని తెలివి తేటలు తక్కువైనా పదిమందితోను కలిసిమెలిసి ఉండే స్వభావం కలవాడు. ఇంతకలవాడూ కాబట్టి కలపవర్తకం లేవదీసి దాన్లో కొంత చితికిపోయి క్రమేణా దాన్ని తగ్గించేసి కొంతకాలం కులాసాగా తిరిగాడు. ఇంతట్లోకే బ్రహ్మయ్యభార్య ఓఆడశిశువునుకని ఆబిడ్డకు ఐదోయేట తిరిగే కానుపొచ్చి ప్రసవించలేక అస్పత్రిలో చనిపోయింది. ఆమెపేరు శకుంతల. అతనికి తనవంకవాళ్లైనహూ నా యనే వాళ్లులేక అత్తవారి బలగంతో మొదట్నుంచీ అత్తిపోవడంచేత ఆపిల్లను పోషించేభారం తల్లితరపువారు వహించారు. ఐతేయేం పిల్లమాత్రం తండ్రి నొకక్షణం విడిచి ఉండేదికాదు. అందుచేత అత్తవారితాలూకు ఓముసలమ్మను తెచ్చి యింట్లో పెట్టుకున్నాడు.

ఆవృద్ధురా లీపిల్లను తండ్రిని జాగ్రత్తగా కనిపెట్టి చూస్తో యింతవండి వాళ్ళకుపెట్టి తాను తిని యిక్కడే పడుండేది. ఆమె బ్రహ్మయ్య అన్నంతినేవేళకు, కులాసాగా, పిల్లనాడించే వేళకు, కులాసాసమయం చూసి, నాయనా ఏదేనా మంచి సాంప్రదాయ కుటుంబములో పిల్లను చూసి పెండ్లిచేసికో! ఇలా వుండగూడదు. దీని వల్ల వుండేయిబ్బందులు అపారము. నీబిడ్డకేమీ భయములేదు. కంటిరెప్పలా నే చూసుగుంటాను. ఐనా మగాడు కాదుగదా ఆడ పిల్ల ఎప్పటికైనా ఓ అయ్యచేతులో పెట్టవలసిందే. పదేళ్ళపాటు తిన్నగాచూస్తే అత్తవారింటి కెళ్ళిపోతుంది. నువ్వేం లేనివాడవా! నామాట కద్దుచెప్పకు. నీఒంటరితనం నేను చూడలేకుండా వున్నాను ఊ అన్నావంటే వందమంది వచ్చి వాల్తారు. వాళ్ళెవరోయెందుకు? రత్నంలాంటి పిల్లను వారంరోజులలో నేనే తీసిగొచ్చి యింటి గుమ్మంలో నిలబెడతానని అనుక్షణం పోరేది.

బ్రహ్మయ్యకూడా చాలా ఆలోచించి, ముసలమ్మ చెప్పినది చాలా బాగానేవుందనీ, ఎంతకాలం ఒంటరితనంగా బతగ్గలమనీ— మనమనస్సు మంచిదైతే పిల్లకేమీ లోటుండదనీ, నీయిష్ట ప్రకారమే చేసుకొంటానని ముసలమ్మకు మాటయిచ్చాడు. అన్వేషణ మొదలెట్టి ఆ యింటికి గంతేసి నాలుగు రోజుల్లో నలుగురు కొంత దూరం బంధువులు, ఆస్తి లేనివాళ్లు అయిన పిఠాపురంవారి పిల్ల, కాస్త కనుబొమలు, ముక్కు తీరు; మేనిచాయ, కుదురుగా, బొద్దుగావుండే చురుకు పాలుగావుండడంచేత బ్రహ్మయ్యకో మాటు చూపెట్టి తానే దగ్గరుండి చేసుకొచ్చింది పిల్లకు 16 ఏళ్లున్నాయి. ఈనాటికి మూడేళ్ళయింది. ఆ కాలంలో అదో పెద్దబారిన కాలంగాదు. సరియైనసంబంధం దొరకక్క పోతే ఏడెనిమిదిఏళ్లుకూడా వుంటారు. పిల్లపేరు రేణుక పల్లెటూరి పిల్లయినా మేను నాగరికతకలదే. అంత నాగరికతకు అలవాటు పడింద్దైనా ఏబాధిసికాదు. యందగత్తె మిసమిసలాడే యౌవ్వనం, పిటపిటలాడే తొడలిపిగింపులో చూశాడేమో సయ్యే అన్నాడు బ్రహ్మయ్య. మూడుముళ్ళూ పడ్డాయి ఏభైతులాల బంగారం పెట్టాడు. పెళ్ళయిన వారంరోజులకే రేణుక యత్తవారింటి కొచ్చింది. అప్పటికి శకుంతలకు పదమూడేళ్ళున్నాయి. పిఠాపురం కాలేజీవారి కాలేజీహైస్కూలులో తర్డుఫారం పాసయ్యి ఫోర్తుఫారంలో ప్రవేశించింది. ఆపిల్లకేమిలోటు. రెండువేళలా యిద్దరు మేష్టరులువచ్చి చదువు చెప్తుతూంటారు. రేణుక యత్తవారింటి కొచ్చినకొలది మాసాలకే ముసలమ్మపైలోకానికి టిక్కెట్టుచ్చుకొని ప్రయాణమయి వెళ్ళిపోయింది. ఈనాటీ రేణుక ఆనాటి రేణుక కాదు. ఇప్పుడు రేణుకను చూస్తే పల్లెటూరిపడుచనుకోడానికి వీల్లేదు. సినిమా నటిగూడా అదే ఐనా అంతముచ్చటగంగా కాదనుకొంటుంది. మంచీ మర్యాదా, పట్నవాసం గౌరవాలు, ఆచారాలు, శోకులు, చదు

క్కులు, యన్నీ నేర్చుకుంది. కానైతే ఆవిషయాల్లో శకుంతలే సవతితల్లికి గురువైందని చెప్పొచ్చు.

ఆదిలో రేణుక ఏపనిచేసినా సవతికూతురు సమాలోచన లేనిదే చేసేదికాదు. ఓమంచైనా,ఓచెడ్డయినా, అస్తమానమూ శకుంతలతోనే ప్రాసుకుతిరిగేది. కొంతకాలం గడచిం తర్వాత మొగుణ్ణి బ్రహ్మయ్య యేమిటే! ఆపేరేం బాగోలేదు—బ్రహ్మయ్యనాయుడూ— అనిపించుకోవాలని ఉడుకెత్తించి అందులోనెగ్గింది అదివరకున్న పాతడాబాను మూడంతస్తుల మేడకింద తయారు చేయించింది. తమయింటికో ప్రక్కవాటంగావున్న డాక్టరు జయరామ్‌నాయుడు యింటిముందు పుంచేటట్టుగా మేడముందు పూల మొక్కలు వగైరాలతో ముస్తాబుచేయించింది. భర్తనుకూడా రకరకాలుగా వేషాలువేయించి వయసు కాస్తమళ్లినవాడని యేమీ అనాదరణగా చూడక [illegible] లోకమని బ్రహ్మానందంతో వుంటుంది. పతివ్రతలనేవాళ్ళున్నారా లోకంలో అనే మూఢులామెను గుణాగణాలను తెలుసుకుంటే వారిబుర్రలోనించి ఆవిశ్వాసం మటుమాయమౌతుంది,

అయితే ఆమె కిప్పుడొక్కటేచింత. తనకిష్టం ఫలించలేదనేవిచారం తప్ప రెండోదామెకులేదు. పైగా ఆచింత అసూయయనేది పిలకలను పెట్టి వేళ్లుపాఱబోతోంది. ఆపిలకలు శకుంతలయనే వేదికయొక్క ఆలవాలంలోకి పాకడం మొదలెట్టాయి. ఇప్పుడు శకుంతలంటే రేణుకకు చిరాకు దీనికి కారణమేమంటే ఆమె రంగురంగులచిలకలా ముస్తాబై రకరకాల మగాళ్ళతో స్వేచ్ఛగావుంటో బి. యే. చదవడం, ఇరవై యేళ్లొచ్చినా పెళ్ళి పూసే లేకపోవడం—పయిగా తనమాట నిర్లక్ష్యం—అనాదరణ—ఇవన్నీ అటుండగా తనకిష్టమైనదో ఒక కాయ కాయకపోవడం—ఈ లంపటం అంతా శకుంతలమీదకు కట్టుకట్టుకొని విరుచుకు పడుతోంది.

బ్రహ్మయ్యనాయుడికి భార్యయందెంత ప్రేమో, కూతురు యందంత మమకారమే. వాటికి విచ్ఛేదం లేకుండగా రోజులు గెంటుకొస్తున్నాడు. పదిమందిలో తలెత్తుకు తిరుగుతున్నాడు. ఇంతఉన్నవాడు. దేనికీ వెదుకులాట యవసరంలేదు. ఇప్పుడొచ్చిందలా కూతురు పెళ్లీడగానే అతని బుఱ్ఱలో నిరంతరము భావపరంపరలను ఎరజిమ్మేసి ఉక్కిరిబిక్కిరి చేస్తోంది. ఓప్రక్క కూతురు బి. యే. పట్టా పుచ్చుకుంటేగాని పెళ్ళాడనంటుంది- ఓసంవత్సరమేగదా ఎలాగో గెంటాద్దామని నాయుడు తలంపు. దానికడ్డు తగులతోంది భార్య— పైగా కూతురు ఒక క్రైస్తవ యువకకవితో ప్రేమకలాపాలు సాగిస్తోనట్టి కింవదంతులు వినిపిస్తున్నాయి. ఇంతవఱకు ఆవిషయంలో గట్టిరోదన పెయ్యలేదుకాని మొన్న భార్య పడకటింటిలో లేవదీసిన గాలిదుమారంమూలాన కూతురు ప్రవర్తనను శంకించకపోయినా ఆవైపు ఓకన్నుపడేసి వుంచాడు.

రేపటిరోజున కాలేజీలో సెలిబరేషను డే జరుగుతుంది. విద్యార్థినీ విద్యార్థుల ఉపన్యాసాలు— ఏకాంకనాటకాలు, వినోదప్రదర్శనాలు— ఫాన్సీ డ్రిస్సు పోటీ వగైరాలు ఏర్పాటుచేయబడ్డాయి. శంకుతల ఆనాడు, పైప్రోగ్రాములన్నిటిలోనూ పోటీచెయ్యడానికి దరఖాస్తు చేసి అందుకు ప్రయత్నాలు చేసుకుంటోంది. మోసెస్ కూడా అన్నిటిలోనూ పోటీదారుగా నిలబడ్డాడు.

ఉపన్యాసాలలో "నేటికవిత్వం" అనే శీర్షికపై పదిమంది విద్యార్థినీ విద్యార్థులు పోటీచేస్తున్నారు. అందులో శకుంతలా మోసెస్‌లు ఇద్దరూకూడా పోటీదార్లే. ఏకాంకనాటకపు పోటీలో వారిద్దరూ భార్యాభర్తలుగా నటించబోతున్నారు. వినోద ప్రదర్శనాలలో శకుంతలేమో ఆంధ్రక్రిస్టియన్ లేడీపార్టు చేస్తోంది. మోసెస్ పార్శీయువకుడు అనేపార్టు ప్రదర్శిస్తాడు. ఫాన్సీడ్రసుపోటీ

లలో శకుంతల - డిస్ట్రిక్టు సూపరింటెండెంటు ఆఫ్ పోలీసు కాబోతుంది. మోసెస్ పర్షియన్ లేడీ అవబోతున్నాడు. శకుంతల వీటికన్నిటికి కావలసిన హంగులన్నీ చేసుకుంటోంది. తర్ఫీదులు రిహార్సలు— తయారీలు— సిద్ధంచేసుకుంటూంది. ఈ హడావిడి అంతాచూసి రేణుక శకుంతలగదిలోకొచ్చి ఈహడావిడంతా ఏమిటమ్మా అని అడిగింది.

"ఏమీలేదు. రేపు మాకాలేజీలో సెలిబ్రేషను డే జరుగబోతోంది, కాలేజీ ఆవరణలో- అందులో ఎన్నోవినోదాలు మొదలైన కార్యక్రమా లేర్పాటుచేస్తారు అన్నిటిలోనూ పోటీచేస్తున్నాను. దానికి కావలసిన హంగులన్నీ చేసుకుంటున్నాను.

"ఈపోలీసు దుస్తులేమిటే! ఈకత్తి యెందుకు? ఈహేట్' బూటు ఎందుకు? ఇవన్నీ ఎక్కడనుంచి తెచ్చావు?"

'ఇవన్నీ రేపు నాకార్యక్రమానికి కావాలి? నేను రేపో అరగంట జిల్లాసూపరెంటు నౌతాను'

"మగవేషం వేస్తావన్నమాట'

'ఔనుపిన్నీ— రేపు బాబయ్యా— నువ్వూకూడారండి- ఆహ్వానపత్రిక పంపిస్తారు. నీకు ఆడవాళ్లలో సీటు ఏర్పాటు చేయిస్తాను. ఇంతటితమాషా నువ్వెప్పుడు చూసుండవు. ఇంతగొప్పగా కాలేజీలో కూడా ఎప్పుడూ జరగలేదు. జన్మ తరిస్తోంది. నామోసెస్ పర్షియన్ లేడీ అవుతా డో అరగంట. అంటూండగానే కాలిబూటు చప్పుడు చేస్తూ గబగబా లోపలికొచ్చాడు. అతను రావడంతోనే శకుంతల అతిఆప్యాయంగా అతనికి షేక్ హేండ్ యిచ్చి గౌరవించి పడకకుర్చీలో కూర్చోబెట్టింది. రేణుక పరిక్కాటుగా తప్పుకొని ముఖం చిట్లించుకొంటూ వెళ్ళిపోయింది. అనంతర మాయువతీ యువకు లీవిధంగా ప్రస్తావ నారంభించారు.

'ఓ మైడార్లింగ్—ఇదంతా రేపటికి ప్రిపరేషనా?

“మన్నంతా కాపీచేసుకొని నా ఆర్టికల్ తియ్యడానికి వచ్చా వన్నమాట— ఆల్‌రైట్,

“ఏదోలాభంగా ఓస్నేహితుడితో కలిసిపోతూ— ఇంతదాకా వచ్చాం ఓమాటు నేనుకటాక్షువీక్షణ ముందుకుపోదామని వచ్చాను,

“ఓ—మైడియర్ మోసెస్— నేను మనం కాలేజీలో అన్నిటి దాల్లోనూ పాల్గొనబోతున్నాం— ఫస్టుప్రైజు ఎవరి కొస్తారో తెలియదు.”

“నాకు తెలుసు, అన్నాను మోసెస్.

“యువర్ ఓకే ఆనా,

“నాకేమి ఆశాలేదు— అవకాశమూ—లేదు,

ఇవన్నీ పైమాటలే—హృదయంలో ఆలోచన వేరు,

“ఎప్పటికీకాదు ఎవరికొస్తుందో నాకు తెలుసు,

“అదికూడా నోటితో అంటావా— ముసుగులో గుద్దులా టెందుకేం,

“ఎవరు తీవ్రమైన కృషిచేస్తున్నారో, ఊహాడానవడంతా విద్యార్థి సంఘంలోవుండి ప్రోత్సహించి యెవరుపెట్టించారో, మాకా లేజీఅంతా ఎవర్ని చూసి మోజుపడతారో, రేపెవరికి విజయప్రద మైన శుభదినమో, వారికొస్తుంది అన్నిటిలోనూ ఫస్టుప్రైజ్,

“మాకుమ్మడిగా చెప్పడం దేనికి? స్పష్టముగా చెప్పాలి. అసూయ పడకూడదు మన మెవరికొచ్చినా,

“నా కసూయ అనేది ఎన్నడూ లేదు. నేను వస్తుందని అను కునేవారికి వస్తే నాకు బ్రహ్మానందమే,

“అలానా? అక్కడ విడిచి పెట్టడ మెందుకు— కంప్లీటు చెయ్యండి,

“ఆ— వారికే- నాయెదుటనుండి నాతో పరిస్థాపనఎవరు చేస్తు న్నారో వారికే—

ఇదంతా హేళనకాబోలు.

'ఇంటిలో హాస పరిమాణేను. హృదయపూర్వకముగా అంటున్నాను.,

'నాకెంతమాత్రమూ అవకాశం లేదని నిశ్చయించుకున్నాను. తీరా పేరిచ్చాయుకాకా అని ప్రయత్నం మానలేకపోయాను.,

అంటూ చిరునవ్వు మొగంబున చిందులాడ— ఓమాటు మోసెస్ ముఖంవైపుచూసి, టీ పట్టుకొస్తానుండండీ— అని యింట్లో కెళ్ళింది శకుంతల—

అదే సమయంలో మోసెస్ కుర్చీలో జేరబడి ఆలోచనా స్మృతిపథంలో మునకలేస్తూ- నాకేమి అవకాశం లేదంటుంది. ఈ విశ్వప్రయత్నం చేసికో,— ఆపాటి పట్టుదలుండదా— ఉండాలి— లేకపోతే ఎలావస్తుంది నేను అనుకుంటూంటే శకుంతల ప్లేట్లతో కప్పులతో లోపల ప్రవేశించింది.

'ఫలహారం కూడానా-,

ఆ- ఏముంది— అంతా మామూలే. దాంట్లోవుంది లోక మంది తాను; అని అంటూనే ప్లేటు టీ కప్పు కాళీ జేసాడు మోసెస్.

శకుంతలకూడా టీ త్రాగడం ముగించి రేపటి సారస్వంలో పన్యాసాని కెంట్లో హాజరు చేసావనుకుంటాను. నీవాలకమే చెప్తూంది—,

'శకుంతలా! నేనేమి ప్రిపరేషన్ చెయ్యలేదు. చెయ్యను— ఏదో ఆవేళకి ఎలా తోస్తే అలా గెంటెయ్యడమే— అసలు ఆశ లేదుగా,

'ఎందుకలా ఉపేక్షించాలి— బోలెడంత లిటరేచరు తెలిసి కూడా ఎందుకో ఉపేక్ష- అంట,

'ఆపత్కాలు- బహుమతులు— షొట్సు— వన్సుమోర్లు, అన్నీ నాకానందం కలిగేవారి కొస్తుంటే నే నెందుకు చిక్కుపడాలి,

'ఇప్పుడే నీవేనిశ్చయిస్తున్నా వేమిటి?,

"థానిపంథే అత—అల్లా జడ్జస్సు తప్పక నిర్ధారణ చేసే వుంటారు,

"వారు విద్యావంతులుగదా! అందులో యింతులకుగదా నిర్ణయం చేసింది.

'ఇంతు లెవరున్నారు నే నొక్కదాన్నేగా పోటీచేసిన యింతినైనా మేల్బంతినైనాను,

"నీవు మేల్బంతివే'

"నన్నాట్టే పొగడకండి"

"ఇందేమి పొగడ్తల్లేవు'

'ఉన్నమాటే అంటున్నాను.

కానియ్యండి—వినబోతూ రుచులెందుకూ! అంటూ శకుంతల మోసెస్‌కు ఇంకా దగ్గరగా జరిగింది!"

"అత డాశించేదీ అదే'

'మోసెస్—నేను పోటీలో పాల్గొనడం మానేస్తానంది. శకుంతల"

"అదేమిటే వింతమాట లంటున్నావు,

"అలా ఎప్పుడూ చెయ్యొద్దు,

కృతజ్ఞతకోసం చేస్తా"

'ఎవరికా కృతజ్ఞత'

'రేపు ఫస్టుక్లాసుప్రైజు పొందేవారికి,

'నువ్వలా ఎంత నన్ను హేళనచేసినా నేనేమీ కించపడను'

ఇందులో హేళనేమీలేదు—ఇప్పుడెందుకు రేపు కంగ్రాచ్యులేషన్సు ఇచ్చే వేళ నొక్కి చెప్పుతాను,

శకుంతలా! ఇక నేవెళ్ళి వస్తాను' అన్నాడు మోసెస్.

అప్పుడేవెళ్ళాలా కాస్సేపు కూర్చోకూడదూ?,

నీదగ్గర ఎంతసేపు కూర్చున్నా కదల బుద్ధెయ్యదు"

ఇవన్నీ పైపై మాటలే. అంతా లోపలి స్వయంపాకమే"
అన్నట్టు మన జననీజనకులకు. రేపుకాలేజికిరా ఆహ్వానం పంపించాలి. కొంచం సెక్రటరీని కలుసుకొని, ఈరెండు పేరులూ అక్కడయిచ్చి వెళ్లాలి వెళ్లేప్పుడు' అంటూ ఓచీటీ యిచ్చింది.

శిరసావహించి యీదాసుండు భవదాజ్ఞ నిర్వర్తింప సర్వదా సంసిద్ధుడు'

అని మోసెస్ అంటే అతనిబుగ్గమీద తన దక్షిణహస్తపు అనామికాంగుళితో ఓచిన్నపోటు సున్నితంగా పొడిచింది శకుంతల. దాంతో యతనికి నవనాడులూ మధురపూరితములై ఆమె ముఖ బింబాన్ని ఆస్వాధింప నాతురత చూపించాడు.

శకుంతలకూడా చాల ఆందోళనపడుతోంది హృదయంలో మోసెస్‌చేసే మోహచేష్టలికి— కాని ఆమెకు మళ్లా బి. యే. పట్టా చేతికి రాలేదే—అప్పుడే తొందరపడితే- ఏవిధంగా పరిణమిస్తుందో యనే యదుట చటాలున గుండెమీద పొడుస్తూంది— సాహసించడంలేదు

ఐతే- అందులోనూ ఆమె యిప్పుడు నవనవోజ్వలసంశోభిత నూతనలతావల్లిక- దాని నల్లుకొనుటకే యన్యమతావలంబనపురుషకిశోరమునకు యర్హత ఉందా- దానికిరువంకలా- కఠోరకంటక మిశ్రితపథంబులు క్రమ్మియున్నదే యని యింకా యేమేమో ఆలోచిస్తూ మోసెస్ విశాలవక్షస్థలాన్ని సునిశితదృష్టితో చూస్తూ అల్లాగే నిలబడిపోయింది. కాని మోసెస్‌మాత్రం ఆమె కర్ణపల్లవానికి ఓకిస్ ఇచ్చి మేల్కొల్పాడు. మళ్ళీ ఆమె ఆయాలోచనా సముద్రపరివారమునుండి తెప్పరిల్లి తీరానికి చేరుకుంది.

ఇంతట్లోనే అమ్మాయీ యనేకేక వినబడడంచేత మోసెస్ ప్రేమపూర్వకంగా హస్తచుంబనమిచ్చి ఆమె స్వరాన్ని బట్టి తన

తండ్రి పిలుస్తాడని చరచరా గదిలోనుండి సావిడలోనికి వచ్చి తండ్రియెదుట నిలబడింది.

---

# 3

ఆవేళ కాకినాడ పి. ఆర్. కాలేజిలోకి అడుగెట్టనివాడిదే దురదృష్టమంతా—జన్మేగాదు— హా! ఏమా సభామండపం—ఆ యలంకారం—రకరకాలకట్లు, బొట్లు, జుట్లు, కట్టింగులు, సెట్టింగులు ఉంగరాలజుట్లువారు, కళ్లజోళ్ళవారు, ప్రెంచికటింగులవారు, గూడ కట్లవాళ్ళు, రంగురంగులుగా యనేక ఫోజుల్లో శోభాయించి యటూ యిటూ తిరిగే చకోరాక్షులు, చంచలాక్షులు, చాలాజూడముచ్చటగావుంది. ఆనాడు సభకధ్యక్షుడో పదహారు యూనివర్సిటీలనుండి డిగ్రీలుపొందిన విద్యాసంతుడు, కళావేత్త, మహావక్త. పోటీఉపన్యాసాలు ప్రారంభమయ్యాయి. ఒకరొక్కరే తమకు నియమింపబడినకాలంలో ఉపన్యాసాలు ముగించి దిగుతున్నారు. మోసెస్ ఉపన్యాసవేదికపై కెక్కాడు, మృదుమధురమైన వచోధోరణిలో ఉపన్యాసం సాగిస్తున్నాడు— కవితచర్చ ప్రారంభించి నేటి కాలపు కవులు క్రొత్తపోకడలలో నవనవోన్మేషభావపరంపరలని వెడలగ్రక్కుతూ, గీతాలు, పాటలు, పదాలు, కథలు— యమోఘంగా రచనచేసి భాషాసేవ చేస్తున్నారు. అందులో— తల్లావఝుల— ముక్కపాటి— దేవులపల్లి— వేదుల— జనమంచి— టేకుమళ్ళ ఇంద్రగంటి చింతా—గుడిపాటి—రచనలు జూస్తే మహదానందం కలుగుతుంది చూడండి—

"వస్తానని చెప్పు గంగితో దస్తు
"తెస్తానని చెప్పు గంగితో—ఈకాస్తపాణము—"
విడిచి యేస్తానని చెప్పు గంగితో

అని ప్రారంభించాడు. సభంతా నిశ్శబ్దంగా వుంది— పురుషు లేగాదు— స్త్రీలేగాదు—అతడాగీతాన్ని శ్రావ్యంగా పాడుతూంటే మైమఱచి కళ్ళు తేలేసి వింటున్నారు. శకుంతలమాట చెప్పనక్కరేలేదు. శకుంతలప్రోత్సాహంచేత రేణుకా బ్రహ్మయ్యనాయుళ్ళు గూడా ఆసభకు వచ్చారు. ఆతనికంఠంలోని శ్రావ్యానికీ, గీతంలోని మాధుర్యానికీ తలవూపని వారులేరు. శకుంతల తానింతకన్నా చక్కగా ప్రసంగిస్తేగాని తనకు ఫస్టుప్రైజురాదు. అయినాయింత కన్నా గొప్పగా నే నుపన్యాసం చేసేదెలాగా— ఐతే ఫస్టుప్రైజు మోసెస్, కొట్టేస్తాడుగా— ఏం కొడితేం మాయిద్దరిలో ఎవరైతేనేమి? అనే ఆలోచనతో—మధ్యమధ్య—అతడు ఫస్టుప్రైజు కొట్టేస్తే—నాకు నామర్దా కాదాయని యసూయపడకపోలేదు— ఏమయితేనేమిటి యీఆలోచనలతో బుద్ధిపాడైపోయి మోసెస్ తర్వాత వేదిక నెక్కిన శకుంతల తడబాటు పడిపోయి ఆమె ఉపన్యాసం చప్పగా కనబడింది—అమెకే చప్పగాఉంటే ఫస్టుప్రైజు ఎలావస్తుంది.

నాటికి సభముగిసింది. అనుకున్న కార్యక్రమమంతా జరిగి పోయింది. మోసెస్ కేసి చూడనివాళ్ళూ—యతన్ని యభినందింపని వాళ్ళూ, భేష్ అననివాళ్లూ ఒక్కరూలేరు— శకుంతలా—రేణుకా—బ్రహ్మయ్య నాయుళ్లు- ఇంటికొచ్చేసారు. మరునటిరోజున ప్రైజు డిస్ట్రిబ్యూషను- ఉన్న 28 ప్రైజుల్లోను- 18 ప్రైజులు మోసెస్ కొట్టేశాడు—శకుంతలకు— 2బహుమతులు మాత్రమే—వచ్చాయి. తక్కిన 8 బహుమతులలో 4 యితరవిద్యార్థులకు—4 విధ్యార్థిను లకు వచ్చాయి. ఆమర్నాటినుంచి కాలేజీగాలరీలో బి, యే, తర

గతిలో చదివే ఆడమ్మాయిల చూపులూ, హృదయాలూ, మోసెస్ మీదకే వాలుతున్నాయి— అదివరకెప్పుడూ మాటలాడని మధుర— వాసంతిక— సరళ— ఏదో పనికల్పించుకొని అతనితో మాటలాడడం మొదలెట్టేరు వేరువేరుసమయాలలో— శకుంతలా మోసెస్‌ల ప్రణయ కలాపాలు ఇంకా కాలేజీదాకా ప్రాకలేదు. దానిక్కారణాలు శకుంతల జాగ్రత్త— దూరాలోచనలే.

కాలం ఆగుతుందా-ఆప్రవాహానికిఅడ్డుఅనేదివుందా- మోసెస్ మాత్రం తనలో—ఈమధురం- నన్నింతపూసుకు తిరగటానికి ప్రయత్నిస్తుం దెందుకూ?— వాసంతిక— వేళాపాళాకూడా చూడకుండా- నన్ను పట్టుకు ప్రాకులాడడానికేమిటి కారణం— సరళ ఏకంగా నాబసకేరావడానికి రెండుమూడుమార్లు యత్నించి— సాహసించలేక-నన్నాయినక్కులు నక్కుకొన్నట్లు— తెలుస్తూనేవుంది— వాళ్ళఅభిప్రాయమేమిటీ—నామీదవాళ్లు ఈఅకారణ వాత్సల్యం చూపడమెందుకూ? ఒకవేళ వాళ్లు ప్రేమించినంతమాత్రాన— నాకు వాళ్ళమీదప్రేమ వుండద్దా— నాకు శకుంతలమీదవుండే గాఢానురాగం ఇంకొకరిమీదకు మళ్ళదు— అది మాత్రం ఖాయం — ఏది ఎల్లావున్నా నేను మాత్రం జాగ్రత్తగానే వుండాలి— వాళ్ళకణుమాత్రమైనా రహస్యంగాగాని, బహిరంగంగా గాని తావియ్యకూడదు—

అనుకుంటూ తనగదిలో క్యాంపుకాట్టుమీద పడుకుని శకుంతలమీది వలపుతలపులతో క్రిందుమీదౌతున్నాడు. ఇంతట్లోకే— ఒక కారువచ్చి అతనిబసముందాగింది— అందులోంచి— ఓ యిరవై యేళ్ళ అమ్మాయి చేతిబేగ్‌తో—రిస్టువాచీ చూచుకుంటూ- కారాప్రక్కగా బెట్టుమని డ్రైవరుతో చెప్పి- మోసెస్ గదిగుమ్మందగ్గిరకెళ్ళి సార్— సార్ అని నింపాదిగా పిలిచింది. ఆమధురస్వరం నిశ్శబ్దంగావున్న తనగదిలోకూర్చుని ప్రణయభావతరంగాల్లో వూగులాడే మోసెస్‌కు

వినిపించలేదు- ఆమె మళ్లీగిరుక్కున కారువద్దకు తిరిగివచ్చి— డ్రైవరు- ఆయింటిలో 17వ నవంబరులో ఎవరేనా వున్నారో తలుపువేసిరిదో చూచి, వుంటే—ఆయనతో మీకొకొ క్కై కాలేజివిద్యార్థిని— మిస్ వాసంతిక—వచ్చిందని- దర్శనంకావాలని చెప్పిరా అంది. డ్రైవరు సరాసరివెళ్ళి తలుపునెట్టాడు. ఆచప్పుడుకు తృళ్లిపడిలేచి మోసెస్ 'ఎవరది?' అన్నాడు. నేను జిల్లాజడ్జిగారి డ్రైవరును—మాజడ్జీగా రమ్మాయిగారు వచ్చారు తమర్ని చూడ్డానికి అన్నాడు. మోసెస్ ఓసారి అతన్ని ఎగాదిగాచూసి, 'ఏరీ' అన్నాడు. కారులో వున్నారండి అనడంతోటే ఆమె వాసంతిక అని తెలుసుకున్న అతడు "రమ్మను" అన్నాడు. డ్రైవరు వాసంతికదగ్గిరకెళ్లి రమ్మంటున్నారండీ అని చెప్పడంతోటే ఆమె ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ— జవజవలాడుతున్న సింహమధ్యంలాంటి నడుముని ఓమారు వెందిరిగి చూచుకుంటూ మోసెస్ ఎదుటబడింది. వెంటనే మోసెస్,

"ఓ! మీరా! రండి"

'గుడీవినింగ్ మిస్టర్ మోసెస్"

'గుడీవినింగ్— మిస్ వాసంత్" ఇలా వచ్చే రేమిటీ యీాదిశం.

"మీకు అభివందనాలు చెప్పాలని ప్రత్యేకంగా వచ్చాను"

'థాంక్యూ"

'మొన్న మీరు కాలేజీలోచేసిన ఉపన్యాసం విన్నవాళ్ళంతా డంగైపోయారండి—చాల ఆనందంగాను, సయింటిఫిక్‌గాను బ్యూటీని చిమ్మేసిందిలెండి- అదివిన్న తర్వాత కాలేజీ అంతా మీారంటే గౌరవం కలిగింది.

'దానికేమిలే_ ఎవరూ లేనికారణంచేత నన్నే గొప్పవాణ్నిగా చేసారంతే'

'అల్లా అనకండి"

"ఇవిగో! మీకొఱ్ఱకై ప్రారికేరానడ మిష్టంలేక- కొన్ని ఉపహారాలు తీసుకొచ్చాను—పుచ్చుకోవాలి"

"చాలా శ్రమతీసుకున్నారు"

'శ్రమేముంది- మనం సుందరము కాలేజీలో చదువుతున్నాం కాబట్టి మనలో మనకి భేదముండకూడదు.

"భేదమనేది యెప్పుడూ లేదే"

'ముందు సంగతి చెప్పుతున్నానండి'

'ఆ—అంతేనా'

"మన పరీక్షలుకూడా దగ్గిరకొస్తున్నాయి'

"ఆహా! వచ్చినట్టే యింకెంత- ఒకటిన్నర నెలేకదూ!

"డిగ్రీపుచ్చుకున్న తర్వాత మీరు యేంచెయ్యదలచుకున్నారు

"ఇంకా ఏమీ నిశ్చయంలేదు— నేనింకా ఒక స్థిరనిర్ణయానికి రాలేదు—

"లా చదవండి'

'ఏం చదివినా దీని ఫలితంవచ్చిన తర్వాతేగా?

'ఓ? తప్పకుండా మీరు ఫస్టుక్లాసులో వస్తారు."

'దైవయత్నం" పైచదువులు చదవడానికి డబ్బుండాలి'

'డబ్బు దగ్గిర అడ్డుతుందా?'

'అక్కడే అడ్డేది?"

'ఆవిషయంలో మీరేమీ బెంగపెట్టుకోవద్దూ! దానికి నేను ప్రోత్సాహ మియ్యగలను'

'ఆఁ— అంత ఔదార్యం చూపించడానికి భగవంతుడు బుద్ధి పుట్టించాలి.

'అదో పెద్దవిషయ్యంకాదు— మనస్సులు కలిస్తే దేవుడు దాకా పోనవసరంలేదు!"

"ఏదో ఒకఅడ్డంకి వస్తూనే యుంటుంది'

"ఎప్పుడూ అడ్డంరాదు— అందుమీరేమీ సందేహించకండి! మామంత్రిగారితో చెప్పి మీకావలసిన డబ్బు నేనిప్పించగలను.

అంటూ తన కుర్చీని మోసెస్ కుర్చీదగ్గరగా జరుపుకుంది"

'నామీద మీకింత అకారణ వాత్సల్యం ఎందుకుకలిగింది?

'అకారణంగాదు- సకారణమే'।

"ఏమిటా కారణం?"

'ముందు ముందు మీకే తెలుస్తుంది. మనమిద్దరంఅప్పుడప్పుడు కలుస్తూంటే సరి"

'అంతమాత్రంచేత సాధ్యమౌతుందా నాపని"

"మనకలయిక— స్నేహం—— మాపెద్దలకు తెలిస్తే తప్పక సాధ్యమౌతుంది"

'నిసంశయమే మీరుపడ్డొద్దన్నాను. మన సంబంధముగూడా ధృవపడి దృఢపడితేసరి"

'నీవనే మాటలు నాకేమీ అర్థం కావడంలేదు.'

'అంత నిగూఢంగా వున్నాయా నామాటలు— మీబోటిబుద్ధిమంతులైన కవిశేఖరునకుగూడా అర్థంకానట్లు మాటలాడేటంత తెలివి నాదగ్గరలేదే"

"నీవేదోనాకాశపురికొల్పుతున్నావు. నాకుదాన్నివిప్పిచెప్పాలి'

"మరేమీలేదు- మనమిద్దరమూ పరస్పరానురాగులమై జీవిత సంబంధం కల్పించుకుంటే మీ కోరిక తృణప్రాయమౌతుంది"

"అదెలా సాధ్యమౌతుంది!"

"ఎందుకు కాదు"

'నామనస్సిదివరకే అన్యాక్రాంతమైంది'

'మీకు వివాహమైందా!"

"లేదుకాని నే నోవ్యక్తిని ప్రేమించాను"

"మాబోటివాళ్లు ఆమెదగ్గర దిగదుడుపేనా!"

"నే నల్లా అనడంలేదు- ఆమె నాకో దేవతగా కనిపించింది'

'ఆమె కేసు తెలుసుగోవచ్చునా?'

"ఇప్పుడే బహిరంగం చెయ్యడం నాకిష్టంలేదు'

"ఓ? ఆదా- అని ఒకనిట్టూర్పువిడచి— నేను చెప్పేమాటలు పూర్తిగావినాలి. నేను జిల్లాజడ్జిగారిమనుమర్ని- మాతండ్రికేకైకపుత్రికను- మాతండ్రిగారిఆస్తి కంతటికీ హక్కుదారిలిని. నన్ను గనుక మీరు ప్రేమించి వివాహం చేసుకుంటే- అదంతా మనయిష్టం- ఇద్దరంకూడా విదేశాలకుపోయి మనయిష్టంవచ్చిన పెద్దచదువు చదువుకోవచ్చు—ఇందుకోసమే నేను ఆత్మాభిమానంతో మీదగ్గరకు వచ్చాను. నన్ను తృణీకరించకండి- పైకి వెల్లడించడానికి వీలులేని పేరుగల అమ్మాయిని మీరు ప్రేమించారంటే నాకే అనుమానంగావుంది- నేను పునర్దర్శనం చేస్తాను- తెలవిప్పించండి- అని షేక్‌హాండిచ్చి గుడ్‌బై చెప్పి తిరిగి చూస్తూ కారెక్కి వెళ్ళిపోయింది.

మోసెస్ ఆమె వెళ్లినపిమ్మట ఆలోచనలో పడ్డాడు. నేను శకుంతలను ప్రేమించాను- ఆమె నన్ను ప్రేమించింది— కాని ఆమెను వివాహం చేసుకోడానికెన్నో అడ్డంకులున్నాయి- కాని ఆయడ్డంకులు వాసంతికపక్షంలో కూడావున్నాయి. వాసంతిక మాత్రం ధనవంతురాలు— డబ్బుకోసం కక్కుర్తిపడి నన్ను గాఢంగా ప్రేమించిన శకుంతలను వదలివేయడమూ— ఆపనెప్పుడూ చెయ్యలేను- ఇప్పుడు చెయ్యవలసిందేమిటి- అని ఆలోచనలో పడికొట్టుకొంటున్నాడు.

అదే సమయంలో ఓరిక్షావచ్చి మోసెస్ గదిముందట ఆగింది- అందులోంచి 20 ఏండ్లవయస్సు కల యువతి చేతిరుమాలుతో అధరోష్ఠాన్ని క్లీన్‌చేస్తూ వయ్యారంగా వాలుజడ నూకచేస్తోను, చీర

కుర్చీల్లోక చేత్తోను పట్టుకొని కాళ్ళజోడు చేసేచప్పుడు కూడా తెలియనీయకున్నంత నెమ్మదిగా మోసెస్ గదిద్వారంవద్ద ఓనిమిషం నిలబడి సకిలించి ద్వారందాటింది. ఎదురుగుండా కుర్చీలో ఆలోచనా సముద్రంలోబడి కొట్టుకుంటున్నాడు మోసెస్. ఆమెను చూడడంతోనే హాశ్చర్యంగా, ఓ మిస్- మధుర— కమాన్ అన్నాడు.

"మైడియర్- మోసెస్- గుడ్ ఈవినింగ్' అంది.

'మార్గంతప్పి వచ్చావేమిటి వేళ,

"మార్గంతప్పి రాలేదు- తప్పకుండానే వచ్చాను"

'ఏమిటి విశేషాలు?'

"విశేషాలేమున్నాయి. మొన్న కాలేజీలో కంగ్రాచ్యులేషన్సు చెప్పుదామంటే అవకాశం లేకపోయింది. సావకాశంగా మాటాడవచ్చునని సాహసించి ఒసకే వచ్చాను."

"తప్పేమి!—మనమొక కాలేజీలో కలిసి చదువుకునేవాళ్ళం'

"అందుచేతనే సాహసించి వచ్చాను. ఏమిటో ఆలోచిస్తున్నారు

'ఆలోచనకేముంది? ఇప్పుడే మనక్లాసుమీాటు వాసంతికవచ్చి వెళ్ళింది.'

"ఆమె నాకెదురైంది. ఇక్కడనుంచేనా?"

'అని కళ్ళు మిటకరించి కనుబొమలు చిట్లిస్తూఅంది. మోసెస్ ఆమెకో కుర్చీచూపించి మధురా! ఆకుర్చీలో కూర్చోమన్నాడు. ఆమె దూరంగావున్న కుర్చీని దగ్గరగా లాక్కుని యతని ముఖంలోకి అదో మోస్తరుగా చూస్తూ, మధ్యమధ్యతనవినీలకుంతలకేశపాశాన్ని, పైట చెంగును సవరించుకుంటూ, మొన్న కాలేజీడే రోజున మీరిచ్చిన సారస్వతోపన్యాసం అమోఘంగావుంది. మన తెలుగులెక్చరర్సు- పండిట్సు కూడా దంగైపోయారు అంటే—

'మధు రా— మీరందరూ నామీదున్న దయచేతనే అలా అంటున్నారు'

"కాదు. ఇది ముఖస్తుతికాదు'

'నాకన్నా అమోఘంగా మాటలాడేవారు మన కాలేజీలో లేకపోలేదు?

'ఉంటే వారుమాత్రం ముందుకొచ్చుండరా"

'ఏకారణం చేతో రాలేరుకాని వస్తే వారిలో ఎవరికో— ఆ ప్రైజు వచ్చుండేదీ?"

"అదేం లాభంలేనిమాట, వచ్చినవాళ్ళ కెవరికేనా ఇచ్చిందా ఏమిటి!

"శకుంతల ఫస్టుప్రైజు కొట్టేస్తుందని నేననుకున్నాను. న్యాయముగా ఆమెకే రావలసింది.'

'ఆమె యుపన్యాసం చాలా చప్పగా వుంది. సబ్జెక్టుడీల్ చేయలేకపోయింది"

"ఏదో కారణాంతరంచే అల్లాఅయుంటుందిగాని శకుంతల తెనుగులో చాలా పరిశ్రమ చేసింది.

"యేమో! కాలేజీలో మా ఫిమేలు స్టూడెంట్సుగాని, మేల్ స్టూడెంట్సుగాని ఆమె యుపన్యాసం మెచ్చుకోలేదు"

'అంతమాత్రంచేతనే అలా అనుకోగూడదు'

"ఆమెయెడల మీకు చాలా అభిమానం కావడంచేత అలా అంటున్నారు."

'అల్లాటి దేమీలేదు. నాకంతా సమానమే'

"అంతా సమానమైతే మీరు స్తపూరామూ ఆమెబసకే వెళ్తారుగాని యెవ్వరైనా మాబసకు వచ్చారా?,

'రాకేమి! మేమిద్దరమూ ఏవో కొన్నిపుస్తకాలు కలిసి చదవడముకోసం కలుసుకుంటూఉంటాము. అంతే'

"అది కాదులెండి. ఆమెయందు మీాకు స్పెషల్ ఇంట్రస్టుంది.

'లోకం వెర్రిది. అంతమాత్రంచేత నే ఏదో వెర్రిమొర్రి ధోరణులుపోతుంది.

'అదే నిజమైతే రేపు మీారు మాయింటికో మాటు వస్తారా?"

'నాకసంత పనుంటె ఎందుకురాను?"

"పనేముంది. కులాసాగా మాటలాడుకోడం కోసం!

'దానికేంతప్పలేదుగాని నేను చదువుకోవలసినది చాలాఉంది. పరీక్షలు సమీపించాయి. శ్రద్ధగా చదవాలిగదా! కాలం వ్యర్థం పుచ్చగూడదు'

"నేనుకూడా పరీక్షకు వెళ్ళేదాన్నేగదా?'

"మీారు చదువకపోయినా గెంటేస్తారు"

"కారణమేమిటో?

"గవర్నమెంటు పరీక్షల్లో ఉమెన్ స్టూడెంట్సుకి క్రెడిట్ ఉంటుందంటారు'

"మార్కులు హెచ్చుగా వేస్తారనా మీారనేది,,

'అంటారు.,

'కారణం.,

'పెద్దకారణమేమిటి! మగాడుకాకుండా ఆడదికావడమే,

'ఎవ్వరేనా నవ్వుతారండీ,

'తెలియకపోయినవాళ్ళంతే,

'ఇంతకీ మీారు వస్తారా- రారా!,

'రాననటంలేదు. చదువుపోతుంది.,

'అయినా మాబోటివాళ్ళిళ్ళకొస్తారా? శంకుతల యింటికైతే పరుగు! మేమేదో అడుసువంటి వాళ్లం,

"అల్లా ఎందుకనుకునేది? ఆమెయందు నా కేమీ ప్రత్యేకాభిమానంలేదు.,

'లేకపోవడమేమిటి? మీరిద్దరూ ప్రేమించుకున్నారనికూడా విన్నాను,

అయితే కావొచ్చును. అంతమాత్ర మేమైందీ?''

'ఏమీకాదు. పెండ్లిచేసుకుంటారెప్పుడో?''

అంతవరకూరాలేదు'

మరెంత వరకొచ్చింది?

దానికెన్నో అడ్డంకులున్నాయి, ఆమె నాయుడునని. నేను క్రైస్తవుణ్ని ఎట్లా?

ప్రేమపూరితహృదయులు ఇల్లాంటి అడ్డంకులు లెక్కచేస్తారా

"చెయ్యరుగాని సాగద్దా,

సాగితే యిష్టమే నన్నమాట'

'ఏంజెప్పను. ఇంకా నేను డిగ్రీపుచ్చుకోలేదు. పిమ్మట గాని ఏమీ ఆలోచనలేదు'

"డిగ్రీపుచ్చుకున్న తర్వాత ఏంజేస్తారు'

'చెయ్యడానికేముంది? పైనచదవాలనుంది. చాలాడబ్బుకావాలి

'డబ్బు మీబోంట్లకడ్డువస్తుందా!

"దానిదగ్గరే చిక్కొచ్చేది?''

డబ్బు సందర్భమైతే ఏంచదువుతారు?,

బారెట్లా చదవాలి అనివుంది'

నాకుగూడా ఆ ఆలోచనేవుంది,

"నీకు సాగుతుంది. నువ్వు డబ్బున్న దానివి,

"ఏదో సందర్భంచేసుకుంటే మీకూ సాగుతుంది. ఎవరేనా సాయంజేస్తారు'

'సాయంచెయ్యడానికి కాస్త కూస్తానా— 20 వేలుకావాలి?''

'ఎందుకుచెయ్యాహా! ఏదో ఒకకొమ్మ నాశ్రయిస్తేసరి"
'ఆకొమ్మ వొట్టిదైతే ఫళక్కుమంటుంది!
'ఆకొమ్మల్లా విరిగేది కాదు"
"బలమైన కొమ్మయితే ఒకేరాగానేవుంటుందిగాని దొరకద్దా'
ఊ అంటే మెదటొచ్చి వాలుతుంది'
"ఎక్కడుందో,
'ఇక్కడేవుంది,
"మధురా! చాలనిగూఢంగా మాట్లాడు తున్నావు'
"ఎంత నిగూఢంగా వున్నా కవులు విప్పుతారుగా"
'విప్పేటంత శక్తివుండాలి"
విప్పేటంతశక్తివుందిగనుకనే కొమ్మతనంతతాను వాలుతూంది!
అల్లాఅయితే కొమ్మని పట్టున్నాయా"
"పట్టుకు దులిపితే రాల్తాయి'

అంటూ యింకా దగ్గరగా కుర్చీలాక్కుని అతని శరీరం తగిలేట్టుగా కూర్చుని అర్థమైందా యిప్పుడూ అని నవ్వడంమొదలెట్టింది మోసెస్‌మాత్రం విస్తుపోతున్నాడు. అంతట్లోకే ఆమెలేచి గదితలుపులు చేరావేసివచ్చి యథాస్థానంలో కూర్చుని నామాటేంజెప్పావన్నట్లుగా అతనిముఖంలోకి చూసింది. మోసెస్‌కిప్పుడంతాఅర్థమైంది. మధురా నాకిప్పుడంతా అర్థమైందిగాని నామనసేమీ బాగాలేదు. తరవాత చూద్దాం—నీవు వెళ్ళిపో అని అతడంటే మైడియర్ మోసెస్—నన్నుగూర్చి నీకు తెలిసేలా చెప్పుతున్నాను. చల్లకువచ్చి ముంత దాచడం ఎందుకు? మాబాబయ్యగారిక్కడ డిస్ట్రిక్టు సివిలు సర్జనని నీకు తెలుసు. నేను వారి కేకైకపుత్రికను. ఆయన సుమారు 5 6 లక్షలరూపాయీల ఆస్తి ఆర్జించారు దానికంతకీ నేనేఅధికారిణిని మేము కులాని కెవ్వరమైనా బ్రహ్మసామాజికులము. నిన్ను నేను ప్రేమించాను. మనమిద్దరమూ వివాహం చేసుకున్నామంటే యి

ద్దరమూ విదేశాలు పోయి పైచదువులు చదవచ్చు. నేను డి. యస్ ఓ చదువుతాను. నువ్వు కాలేజ్లో చదవచ్చు నామాటకు నాతలిదం డ్రులెదురుచెప్పరు. అని ఆతని చేయిని తాకుతూ చుబుకాన్ని మునివేళ్ళతో పుణకబోయింది. మోసెస్ ఆలోచనాసముద్రంలో బడి కొట్టుకుంటూగూడా ఆ చెయిని విసిరేసి మధురా? నాకేం మనస్సు బాగాలేదు. వెళ్లి రా? అన్నాడు. అంతేనా అని ఓ నిట్టూర్పు విడిచి అతనివేపు చరచరా చూస్తూ వెళ్లిపోయింది.

ఆమె యింకా పూర్తిగా గది దాటిందో లేదోగాని ఆమె క్లాస్ మేటు సరళ గుబ్రుముబ్బ్గిని మోసెస్ యింటిదగ్గర ఆపడం లోపలకువెళ్ళడం మధురచూచింది. సరళకూడా మధుర మోసెస్ గది లోంచి రావడం చూస్తూనేవుందికాని ఒకరితో వొకరు మాట్లాడుకో లేదు. సరళ బర్మాశాండిల్సు చప్పుడుచేసుకుంటూ శనమవిసరపరిమిళి తథమ్మిల్లాన్ని వాముహస్తంతో సరిచేసుకుంటూ మోసెస్ గదిలోకి విసవిసగానడిచివెళ్ళి "గుడియర్ పేయిట్? గుడీవినింగ్ అంది. మోసెస్ తడబడుతూ, గుడీవినింగ్ సరళా అన్నాడు. అతని అనుమతి లేకుండానే ఆమె ఒకకుర్చీని అతనికుర్చీకి దగ్గరగా లాక్కొని—

అలావున్నారేమి

"ఎలావున్నాను,

"నీరసంగా కనిపిస్తున్నారు,

నీరసంలేదే ఏదో ఆలోచిస్తున్నాను,

'మధుర మీయింట్లోనుంచేనా వెళుతోంది.

"ఔను"

'ఏమిటి విశేషం,

ఏమీ విశేషంలేదు. ఏదో కాస్సేపు బాతాఖానీవేసి వెళు తోంది,—

'అప్పుడప్పుడు ఆమెరావడం కద్దా ఏమిటి?,

'ఎప్పుడూ నాకవకాశం రావడంలేదు. ఈవేళే వచ్చింది"

ఏమిటా బాతాఖానీ రహస్యము కాదుగదా?

రహస్యమూగాదు— అలా అని బట్టబయలూకాదు——కాని యివ్వేళ మీరంతా ఇల్లా దిగబడ్డారేమిటి?

అంతా ఎవరు?"

ముందుగా వాసంతిక వచ్చింది. తరవాత మధురం వచ్చింది— పిమ్మట నువ్వు హాజరయ్యావు,

'మీతో చాలా కాలాన్నించి మాట్లాడాలని కుతూహలము. మొన్న కాలేజీహాలులో మీయుపన్యాసం విన్నతర్వాత ఎప్పుడుమిమ్మల్ని కలుసుగొందామా అనే ఆతురత పుట్టింది? కులాసాగా కాస్సేపు మాటలాడుకుందామా,

'నాఒంటిలో బాగాలేదుకాని నువ్వువస్తే ఎల్లావెళ్ళిపోమ్మన్ను.

'ఆమాత్రం దయ మామీదుంటే చాలు.

నాదయ నీకేం ఉపకరిస్తుంది,

ఉపకరిస్తుందనే ఆశ. శకుంతలకేగాని మీలాంటివాళ్ళు కుపకరించదా ఏమి?.

'ఆమెకుమాత్రం ఏమి ఉపకరిస్తుంది?

"ప్రేమాస్పదురాలికి ఉపయోగించక పోవడమేమిటీ?

ప్రేమించుకున్నంతమాత్రాన నది సఫలంకావద్దా?

'ఎందుకు సఫలంకాదూ మనస్సులు కలిస్తే

మనస్సులు కలిగినంత. మాత్రాన మనువులు కలుస్తాయా! దానికెన్ని ఆటంకాలు. సంఘం—మతాలు— ఆశయాలు —పెద్దలు—— ఇంకా ఎన్నో!,

'అల్లాంటివేమీ ప్రేమీయుల్ని అడ్డలేవు,

అలాక్కాదు సరళా మనమనుకుంటాంకాని మనఇష్టమా?

'మనయిష్టంలోనే వుంది మజా.

"ఏమిమజాకాని నువ్వు షికారు వెళ్ళేవేళ—కాలేదా?
"ఇవ్వేళ షికారుకెళ్ళడం మాని యిలా వచ్చాను,
"ఏమిటి విశేషం"
"ముందే చెప్పాను. కులాసాగా కబుర్లు చెప్పు కుందామని,
'మనకి కులాసా కబుర్లేమున్నాయి'
"ఉన్నాయనుకుంటే ఉన్నాయి— లేవనుకుంటే లేవు"
"నాకేం కనుపడ్డంలేదు"

"మీకెందుకు కనుపడతాయి— నువ్వంతా యీమనుష్యులను కాళకుంతలవిూదే వుంచుకుంది, ఆమె కుటిలకుంతల—సింహేంద్రమధ్య కలియుగరంభ—కాబట్టి"

'తెగవేసి చేస్తున్నావు సరళా"

'కాన్లేవు కులాసాగా మాటలాడాలనిపిస్తే మీరుశోసి రాజు చెయ్యాలని చూస్తున్నావు నన్ను. నాతో మాట్లాడటం ఇష్టంలేదా

'ఇష్టంలేకపోవడమేమి! అలా షికారుగాపోయి మాటలాడు కుందాం"

'బయటవద్దు, ఇక్కడే హాయిగావుంది,

'ఇక్కడేమిహాయి - అలా సముద్రపు వొడ్డుకు పోదాము.

వద్దు! తరవాత నెమ్మదిగా వెడదాము. మిమ్మల్ని ఒక్కవిష యం అడుగుదామని వచ్చాను!"

'ఏమిటది?

"మరేమీలేదు. నేను చాలాకాలాన్నుంచి మిమ్మల్ని ప్రేమి స్తున్నాను,

"నీవు నన్ను ప్రేమిస్తే నిన్ను నేను ప్రేమించద్దా?,
"అదే అడుగుతున్నది? నే నెవరినో తెలుసా?
"నిన్ను గూర్చి నాక్లాస్ మేటువనితప్ప నాకేమీ తెలియదు!"
'అయితే వినండి నేను యిచ్చటి పోలీసు సూపరెండెంటుగారి కూతుర్ని! నాతండ్రి ఝుంఝుమించు పదిలక్షలాస్తి నార్జించాడు,

డిపార్టుమెంటులో ఐ. జీలదగ్గరనుంచీ మంచి పలుకుబడి. ఆయన ఆ స్తంతకూ నేనే హక్కుదారాలిని. నన్నుగనుక మీరు మారేజి చేసుకుంటాను అంటే పోలీసుశాఖ డిప్యూటీ సూపరెండెంటుగా పోస్టింగిస్తారు. మనవిషయంలో మతభేదమేమీ అడ్డులేదు. మేము తరతరాలనుంచి బ్రహ్మసమాజికులంగానే వున్నాము. వర్ణాంతరవివాహ సమస్య మనజోలికిరాదు, అని చెబుతూంటే మోసెస్ హఠాత్తుగా "చాల్లే ఇక ఆపు సరళా" అనేసరికి సరళ తలకిందులైపోయింది. ఆమె ఆశాసౌధం మొదలంటా కూలిపోయింది. వెంటనే ఆమె చర్రున లేచింది. మోసెస్! నాతండ్రిహోదా, నాకు దఖలపడే ఆస్తి, నాకు నీమీదున్న ప్రేమా అంతా నాకు నేనై సిగ్గువిడచి నీయెదట వెళ్ళబోసుకుంటే నన్ను కాలదన్నుతున్నావు. ఇప్పటికయినా మించిపోయింది లేదు. నీకోవారం టయమిస్తున్నాను. అప్పటికయినా నీవు నాదృక్పథంలోకి రాక ఆశకుంతలక్కై పాకులాడావంటే ఎన్నో చిక్కులుపడతావు. సరిగా ఆలోచించుకో. మనసు కుదుటపరుచుకో అంటూ చరచరా నడచి తిరిగీ అతనివైపోసారి చురచురా చూస్తూ వెళ్ళిపోయింది.

మోసెస్ ఆలాగే కుర్చీలో కూర్చుని ఆలోచించడం మొదలెట్టాడు. కాలేజీలో యింతమంది బి. యే. స్టూడెంట్సుండగా నాదగ్గర ఏంఘనతచూసి వీళ్ళిల్లా నామీద విరుచుకుపడ్డారు. డబ్బుందాఅంటే పేదవాణ్ణి. ఏలాగో జీతం కట్టుకొని ఓపూట పూటైనా యింతవరకు గెంటుకొచ్చాను. ఆపత్రికలవాళ్ళు నావ్యాసాలు వేసుకోకపోయినా వాళ్లు సకాలానికి డబ్బు పంపకపోయినా నాచదువుకు స్వస్తికదా? ఇక చదువుసంధ్యలమాట చూద్దామంటే తాముచదివే బి. యేక్లాసే. నేనూచదువుచున్నాను. నాకన్నా తెలివైనస్టూడెంట్సు ఎంతమందో వున్నారు. అందచందాలు చూద్దామాఅంటే మాక్రైస్తవులలో నేనొకఅందగాణ్ణిగా లెక్కింపబడుతున్నా—కాలేజీ స్టూడెంట్సు విషయంలో

లో అందచందా లెంచవలసివస్తే నాకు పధ్యగ్లాని వస్తుంది. ఇహ ఎటొచ్చీ నోటమ్మట నాలుగుముక్కలు తప్పులేకుండా వాగటం—ఏవో వెర్రిమొర్రిపాటలు— మిడతంబొట్లుకథలూ వ్రాస్తాను. ఈమె వ్యూహా ఏంచూసి నామీద మోజుపడుతున్నాదో తెలియదు. ఈ పోలీసుద్యోగస్తుని డాటరు ఆదరింపకూడా మొదలెట్టింది. నాకూ శకుంతలకూగల సంబంధాన్ని గూడా తెలుసుకుంది. ఇప్పుడు నేను చేయదగినదేమిటో బోధపడడంలేదు— అయినా దీనికింత ఆలోచనెందుకూ? అన్నిటికి మాయేసుప్రభువేవున్నాడు, ఇవ్వేళ వీళ్ళు నామనస్సంతా పాడుచేసారు. ఓమాట్లాగా శకుంతల యింటివేపు షికారుగా వెళ్ళి ఆమెతో బాతాఖానీవేస్తేకొంత ఆలజడి తగ్గుతుందేమో అనుకుంటూ ఉన్నదాంట్లోనే కాస్తగంజాడా టాయిలెట్టయి బయలుదేరాడు.

---

## ౪

"గంటసించి చెప్తున్నాను. ఏవిధంగా సమాధానం మిస్తోందో ఆలకించండి"

అంటూ రేణుక శకుంతల గదిలోనుంచి బయటనున్న భర్త దగ్గిరికొచ్చింది విసురుగా. బ్రహ్మయ్యనాయుడు సవతితల్లయిన రేణుక శకుంతలకు చెప్పేమాటలు—ఆమె చెప్పేసమాధానాలు వింటూవున్నాడు—కాని ఆమె చెపుతూందికదా—మనం గూడా యెందుకు— తర్వాత మనదాకా యెల్లాగూ రాకమానదని ఖండవా పైనవేసికొని చేతికర్ర పుచ్చుకొని బయటికి వెళ్ళడానికి సిద్ధంగా వున్నసమయంలో రేణుక భర్త వద్దకొచ్చి— నన్ను గానట్లుగా వెళ్ళిపోతారేమిటి? మొదటినుంచీ యిలా చెయ్యబట్టే అమ్మాయి యింతచక్కగా తయారయ్యింది, ఏం

చేసుకుంటారో చేసుకోండి. నాకేం పట్టింది. కండకులేనిదురద బచ్చ
లకా! కన్నతండ్రికే యిష్టంగావుండి సాగిస్తూంటే మధ్య నాకెందు
కీరభస—సన తల్లి సాగనిచ్చిందికాదనే అపవాదు నాకెందుకు? అంటూ
చరచరా తనగదిలోని కెళ్ళిపోయింది.

బ్రహ్మయ్యనాయుడికి బ్రహ్మాండమైన చిక్కొచ్చిపడింది. అటు
భార్యచెప్పేది చాలా సబబుగా కనుపిస్తోంది. కూతురి సమాధానాలు
బేసబబుగావున్నా గారాబంచేత ఏమీ అనలేకపోతున్నాడు. ఇవ్వేళ
తల్లీకూతుళ్ళసంభాషణంతా విన్నాడు రేణుక విసిగివిసిగి చెప్పి చెప్పి,
ఆమె యేవిధంగానూ లొంగనందున తనమాట నెగ్గకపోవడానికీ
భర్త ఉపేక్షించడానికీ—శకుంతలచెప్పిన నిర్లక్ష్యపుజబాబులకీ ఉడుకు
మోత్తనంవచ్చింది. తక్కినవిషయాలలో మాట అలావుంచి శకుంతల
పెళ్ళివిషయంలో ఆమె చెప్పిందంతా సబబుగానేవుంది. నువ్వు: విద్యా
వంతుడైన కులస్థున్నెవర్నైనా పెళ్లిచేసుకుంటేనే నేను సహిస్తానుగాని
ఆకిరస్తానీ వెధవని పెళ్లాడటానికి వీల్లేదు, ఆపక్షంలో నిన్నింట్లోనుంచి
గెంటించనేనా గెంటిస్తాను, లేకపోతే యెందులోనేనాపడి చావనేనా
చస్తాను. నీమాట సాగనివ్వనని గోల. ఏమైనాసరే నేనాక్రైస్తవయు
వకుణ్ని ప్రేమించి పెండ్లిచేసుకుంటానని వాగ్దానమిచ్చాను కాబట్టి
యెన్ని అడ్డంకులువచ్చినా అతన్నే పెళ్లాడుతానంటుంది. కూతురు
శకుంతల. బ్రహ్మయ్యనాయుడికి కూతురు క్రైస్తవుణ్ని పెళ్లాడటం
గాని—అతనితో షికారు వెళ్లడంగాని—చనువుగా తనయింటికితీసికొచ్చి
మాటలాడడంగాని యిష్టంలేదు. ఆమెమీద వున్న ప్రేమచేత ఎదు
రాడలేకపోయాడుగాని యింతవరకు ఈవేళ నాయుడికి కోపంచుట్టు
కొచ్చింది. వెంటనే బయటకు వెళ్లేతలంపొదిలిపెట్టేసి వెందిరిగి సరా
సరి సావడిలో కొచ్చాడు 'అమ్మాయి' అనికూతుర్ని కేకేసాడు.

శకుంతల వెంటనే చదువుతోన్నపుస్తకం టేబిలుమీదపెట్టి "పిలి
చారా బాబయ్యా?" అంటూవచ్చి తండ్రికిదగ్గిరగా నిలబడింది.

"ఏమిటమ్మాయీ యీగందరగోళం— నీవనేం బాగాలేదు"

"ఇన్నేళ్లా అంటున్నారేమండి నాన్నగారూ"

"నీకూ పిన్నమ్మకూ ఇందాకటనుంచీ జరిగినసంభాషణంతా విన్నాను"

"అయితే'

"మరేమీలేదు. నీపెళ్ళివిషయం గురించి నీతో మాట్లాడుదామని యేసంగతీ తేల్చుకుందామనీ పిలిచాను.'

'మీ యుద్దేశ మేమిటో చెప్పండి"

'చెప్పండంటేకాదు. ఈవిషయంలో నీప్రవర్తనేమీ నాకు నచ్చలేదు.'

'అంత అపనీతికరమైన యత్నమేమీ నేను చెయ్యాడంలేదు'

'నీకల్లా కనుపించడంలేదుగాని విన్నవారికీ కన్నవారికి యీ ప్రవర్తనేమీ బాగాలేదు.'

"మీ అభిప్రాయ మేమిటో నాకు విశదంగా చెప్పండి"

'ఆహా! అలాగే చెప్తున్నాను. విను. మనం స్వచ్ఛమైన నాయుడు కుటుంబంలో పుట్టాము. మనవంశానికి తరతరాలనుంచి మచ్చలేదు. నీకు చిన్నతనంలో తల్లిచనిపోతే అష్టకష్టాలూపడి నిన్ను పెంచాను."

'ఇప్పుడు కాదని నే నన్నానా? ఇప్పటికీ నావిషయంలోఅంతే'

'అలాకాదు. నామాటలు పూర్తిగావిను. దేశకాలపరిస్థితులను బట్టి మనయింటావంటా లేకపోయినా, చదువుమీద నీకున్న ఆవస్థను బట్టయితేనేమి? సరదావల్లయితేనేమి? ఆడదానికుండవలసినంత చదువుచెప్పించాను. ఈపాటికి మూసమంటే బి. ఏ. ప్యాసవ్వాలని ఉందన్నావు పోనీ పిల్ల అంత సరదా పడుతూంటే మనము మాన్పించగూడదని అందుకూ సిద్ధపడ్డాను. ఇప్పుడు నువ్వు క్రైస్తవుణ్ణి ప్రేమించావనని అతన్నే పెళ్లాడతాననీ డంకామీద దెబ్బకొట్టి చెప్పు

తున్నావు. అది మనబోటివారికి కూడనిపని. మనకులస్థులలో చాలా మంది చదువుకున్న వాళ్ళున్నారు. వాళ్ళల్లో నీయిష్టమొచ్చినవాణ్ణి చేసుకో. ఆఅధికారం నీకేయిచ్చాను. అంతేగాని మాలవెధవనెవణ్నో పెళ్ళాడతానంటే వప్పుకోను.

'మనసు నిలచినవానిని పెళ్ళాడటమే మానినీలక్షణమని మన శాస్త్రాలూ— వేదాలూ— చెప్పటంలేదా?' ఇందు నాతప్పేముంది. క్రైస్తవుడైతేనేమి బ్రాహ్మణుడైతేనేమి? ప్రేమముందు జాతిమతభేదాలు అడ్డు నిలవగలవేగాని ప్రేమప్రవాహాన్ని అరికట్టలేవు.

"అల్లాగని మాలముండాకొడుకుని పెళ్ళాడుతావా?

'నాకంటికతడు దేవుడులా కనిపిస్తున్నాడు. నామనస్సుకతడో పరమాత్మ స్వరూపుడుగా నున్నాడు. అందుచేత అతనిమీదే మనస్సు నిలిపాను. పెళ్ళాడితే అతన్నే పెళ్ళాడతాను. లేకపోతే బ్రహ్మచారిణిగా వుంటాను.

'అంతేగాని నామాటలుగాని నవతల్లి మాటలుగాని వినవన్న మాట?''

"మీామనసుకు కష్టం గలిగించుచున్నందుకు దుఃఖిస్తున్నాను. గాని ఆక్రైస్తవ యువకుణ్ని ప్రేమించడం మానలేను''

'నీ పేరిమమండినట్లుగానే వుంది. నావద్ద ఆమాలవెధవ మాట తలపెట్టావంటే సహించను. నీకిదే చెప్పటం?

"నాఉద్యమం మానమంటున్నారేగానిమీాఅభిప్రాయమేమిటో చెప్పారుగాదు'

"నాయభిప్రాయం చెప్పడానికేముంది. చెప్తున్నావిను. మన కులంలో నీఅంత చదువుచదివిన యువకులు— ధనవంతులైనవాళ్లు— లేంప్లాడ్సు— అనేకమందున్నారు. అందులో మంచివాణ్ని, ఏరుకొని పెళ్ళిచేసుకో- పిచ్చిపిచ్చి వేషాలెయ్యకు?

అని తండ్రి చెబుతూంటే శకుంతల ఓర్ట్రాన్స్పు విడిచి కళ్ళనెంట నీరు కారుస్తూ నిలబడిపోయింది.”

ఆ దేసమయంలో టీక్ టాక్ గా డ్రస్సేసుకొని బూటుచప్పుడు చేసుకుంటూ మోసెస్ శకుంతల గదిలోకి వెళ్ళబోతూ బ్రహ్మయ్య నాయుడు క్రోధతామ్రనేత్రుడై యుండడం- శకుంతల బాష్పాకులిత లోచనయై తండ్రిప్రక్క తలవాల్చుకొని నిలబడి యుండడంచూచి చటా లున ఆగిపోయాడు.

బ్రహ్మయ్యనాయుడు మోసెస్ను చూచిన వెంటనే కన్నుల వెంట నిప్పులు గ్రక్కుతూ— నీకిదే చెప్పటం— మరోమారు మొదలీగు మ్మమెక్కినా- నాకూతురితో మాట్లాడినట్లు తెలిసినా— నిన్ను డొక్కబద్దలు చేయిస్తాను- పోలీసు కప్పగిస్తాను- కాలేజీలోంచి నిన్ను డిస్మిస్ చేయిస్తాను పో— వెంటనే అవతలికి పో— అని గద్దించాడు.

ఆ! ఆ!! ఆ!!!

అంటూ అక్కడే కూలబడిపోయింది శకుంతల. నాయుడు వెం టనే భార్యను పిలిచాడు. గ్లాసుతో నీళ్లు తెమ్మన్నాడు. ఆమె నీళ్ళు తెచ్చి శకుంతల మొగంమీద కొట్టి, చెంగుతో విసురుతూ— ఉపచా రాలూ చేస్తూంది. నాయుడు చాలా కంగారు పడుతున్నాడు. మోసెస్ శకుంతల పరిస్థితి గమనించి కూడా వెనుదిరిగి చూడకుండా యింటి తోవపట్టాడు.



X

మర్నాడు కాలేజీగాలరీలో ఫోర్త్ యియరు క్లాసులో విద్యార్థినీ విద్యార్థులంతా హాజరయ్యారు. మగాళ్ళ సీట్లులో మోసెస్ దీ, ఆడవారి సీట్లలో శకుంతలది ఖాళీ! విద్యార్థులంతా ప్రశ్నార్థకం వచ్చినా

ఆప్సెంటుకాని మోసెస్ క్లాసులు దగ్గిరపడ్డ యీరోజులలో ఆప్సెంటు
కావడమేమా అని ఆశ్చర్యం పడ్డారు. ఫిమేలు స్టూడెంట్సుకూడా
మోసెస్ రాకపోవడానికి కారణమేమా అని ఊహిస్తూ అతని సీటు
కేసి యింకా వస్తా డింకావస్తాడని ఘుల్సాపుల్సా చూస్తున్నారు. మో
సెస్ కాలేజీలో అడుగుపెట్టిన తర్వాత ఆప్సెంటు కావడానికీ- లెక్చె
రర్సు చెప్పే లెక్చర్లకి గైరుహాజరు కావడానికీ- యిదే ప్రథమంకావ
డంచేత విద్యార్థినీ విద్యార్థులే కాకుండా కాలేజీలెక్చరర్సు ప్రిన్సిపలు
సహితంగా అతని ఆప్సెంటుకి కారణం ఊహించలేకపోయారు. ఆశ్చ
ర్యపడ్డారు. ఫిమేలు స్టూడెంట్సులో మాత్రం ముగ్గురు మరీ కళవళపడి
పోయారు. కారణమేమిటంటే మోసెస్‌తోపాటు ఆనాడు శకుంతల
సీటుకూడా ఖాళీగావుండటమే. మోసెస్‌లేని గాలరీ ఆనాడదోమా
స్త్రరుగావుంది. ప్రతీ లెక్చరరూకూడా గాలరీఅంతా ఓమారు సింహా
వలోకనంచేసి మనస్సులో అతను "రాలేదేమా" అనుకుని ఒక్కడూ
కూడా యూజువల్ స్పీడులో పాఠమే చెప్పలేక పోయాడు.

"ఆసమయంలోనే మోసెస్ బసపక్కవున్న యింటి యజ
మానిదగ్గిర్నుంచి ప్రిన్సుపాలుకో చేతివుత్తరం వచ్చింది.

అందులో మోసెస్ గదిలో దీపమింకా వెలుగుతోందని,
గదితలుపు లెంతపిలిచినా తెరవబడలేదనీ, నాకేమీ సంబంధం లేక
పోయినా అతని సౌజన్యతనుబట్టి కాస్తోకూస్తో సంబంధంవున్న మీకు
తెలియబరచడం నావిధి అనివుంది. వెంటనే ప్రిన్సిపాలావుత్తరాన్ని
డ్యూటీలోవున్న వైస్ ప్రిన్సుపాలును పిలిచి సలహాచేసి ఆనాటికికాలే
జీని మూయించి తాను, వైస్ ప్రిన్సుపాలు యిద్దరు లెక్చరర్లు కారు
మీద మోసెస్ బసకెళ్ళి యీచటి స్థితికి చింతపడుతూ పోలీసుకిఫ్యా

టీసూపరింటెండెంటుకు కబురంపించి బలవంతాన గదితలుపులు తెరిపించారు. పదినిమిషాలలో కాలేజీఅంతా మోసెస్ గదిగుమ్మందగ్గిర వాలింది. మోసెస్ శరీరస్మృతిలేకుండా పడున్నాడు. అతడు జీవించే ఉన్నాడని ఓ లెక్చరర్ బయటవాళ్ళందరికీ చెప్పాడు. పోనీ పాపమన్నాడో విద్యార్థి మంచివాడన్నాడింకోడు. అయ్యో! ఆశపడ్డాను ఫస్టు క్లాసుకన్నాడో ఆసూయాపరుడు. అన్యాయ్యా అంది వాసంతిక. గుండెలిప్పటికప్పుడుపట్టాయంది మధురం. ఆడదాని వుసురు వూరికే పోతుందా అంది సరళ. ఆముస్లహూ ప్రిన్సిపాలు గొణుక్కున్నా, పోలీసువాడు అదలించినా లెక్చరర్లు పళ్ళు బిగించినా, అంతా వెళ్ళిపోయినా అక్కడే తచ్చాడుతున్నారు.

పోలీసువాళ్ళు కంపర్ని తోసేసారు. నిశ్శబ్దంగావుంది. అప్పటికే ప్రిన్సిపాలు కబురంపుకొన్న సివిల్ సర్జనువచ్చి మోసెస్‌ను పరీక్షించి ఏదోవిషాదకరమైన వార్త వినడంచేత యింద్రియాలు వివశమైనాయి హాస్పిటలుకి చేర్చే యత్నంచేస్తున్నారు! ఆతరుణంలో మోసెస్ కదలడం ప్రారంభించి రెండుపెదవులసందునుంచీ, శ—కుం—త—లా— ఎం—త—ప—రా—భ—వం— అ—న్యా—యం—అని కలవరించాడు. హాస్పిటలుకుతీసుకెళ్ళేత్రోవలో గడసువాడైన ఓ లెక్చరర్—ప్రణయగాథండీ ఇదంతా- ప్రారంభించిన మూలాసురుడూ— ఆసల్లాకలాఉంటే ఎర్రనవ్వాయి శకుంతల అని ప్రిన్సిపాల్ చెవిలో చెప్పాడు. హాస్పత్రిలో మోసెస్‌ను ప్రవేశపెట్టి ఎవరిళ్ళకి వాళ్లు వెళ్ళిపోయారు.

---

## 3

శకుంతల తలిదండ్రుల శీతలోపచారాలకి తేరుకుందేకాని కుద టపడలేదామెఆరోగ్యం. జ్వరము, నీరసము— మంచంపట్టింది—మంచి డాక్టర్లు చాలామంది ట్రీట్‌చేసి విడిచారు. ఓనెలనుంచి లేడీడాక్టరొకా మె ట్రీట్ చేస్తోంది. ఆమె యల్. యమ్. యస్. ప్యాసై పదేళ్లనుం చిప్రాక్టీసు చేస్తూ నాడీ రోగపరీక్షలలో అసమానురాలనిపించు కుంటోంది. నెలరోజులు ట్రీట్‌చేసినా వ్యాధేమిటో తెలియకపోవ డంవల్ల ఆమె మరింత పట్టుదలతో పనిచేయడం మొదలెట్టింది ఏమీ తగ్గలేదు. ఓనాడామె ఒంటరిగా రోగిదగ్గరకూర్చుంది. తలిదండ్రుల్ని ఏవో పనులుచెప్పి అవతలకు పంపించింది.

ఆసమయంలో నిశ్శబ్దంగావున్న గదిలో లేడీడాక్టరుచెవికి మంచంమీది శల్యావశిష్టయై పడున్న శకుంతల రెండుపెదవులమధ్య నుంచీ అప్రియత్నంగా— అస్పష్టంగా— నా- మో- సె- స్-నా మూ లాన- ఎంత పరాభవం— అనేమాటలు వినబడినాయి. డాక్టరమ్మ ఓ మాటు తలూచి తటాలున ఎగిరి గంతేసి తలిదండ్రులిద్దరినీపిలిచి పరిస్థి తంతా చెప్పి అభయహస్తమిచ్చి క్రైస్తవుడైతేనేమి ఆమెకోరిక తీరు స్తేనే జీవిస్తుంది. మందుకూడా అవసరంలేదు. ఇలానికేవో టానిక్ చెప్తానివ్వండీ అని ఆమె వెళ్లిపోయింది.

దైవం రక్షించి మనబిడ్డలేచి తిరిగి బ్రతికిబట్టకడితే తప్పకుండా అలాగే చేతాము. క్రైస్తవుడైతేనేమి? వర్ణాంతర వివాహాలు మన కళ్ళయెదుట వేలు జరుగుతున్నాయి. అని రేణుకా బ్రహ్మయ్యలు స్థిర పరుచుకున్నారు. మరో పదిరోజుల్లో శకుంతల తేరుకుంది. తల్లిదం

దుగ్రిలు వారినిశ్చయూ న్నామెకి తెలిపారు. ఆమెదినదినాభివృద్ధిగా ఆరోగ్యం కోరుకుంటూఒకనెలనాటికి ప్రస్తుత స్థితిలోకి వచ్చింది.

మోసెస్ హాస్పత్రినుంచి పిడుదలై కాలేజీకి హాజరయ్యాడు— ఓమాటు గేలరీ అంతాసింహావలోకనం చేసాడు తనకుకావలసిందేదో అతనికగ్నుపించలేదు. ప్రిన్సిపాలు గారికి వందనాలు చెప్పడానికివెళ్లి నరికి అక్కడ శకుంతల సెలవుచీటి కనుపించింది. అన్నీ గ్రహించు కున్నాడు. మనస్సంతా మరల వికలమైంది. కాలేజీగోడల మీాదెక్కడ చూచినా "శకుంతలా మోసెస్‌ల ప్రణయరహస్యం" అనే అక్షరాలే అదిచూచి మోసెస్ సిగ్గుపడి కాలేజీ విడచి యింటికొస్తూ ఇప్పుడు శకుంతలను నేను చూడగలనా! చూడకుండా వుండగలనా? ఆమె ఎంత నూతనభావాలు కలదైనా పెద్దలొప్పుకోగద్దా? ఈవిషయంలోముందు వెనుక లాలోచించకుండా నేను తప్పుపనేచేసి యిద్దరి ప్రాణాలకీ ముప్పు తెచ్చాను! ఏమికానున్నదో ఏసుప్రభువు కెరుకఅనిఆలోచించు కుంటూ తనగదికి చేరుకున్నాడు.

అతను ఒసకు రాకముందే ముగ్గురు అతనికై వేచిఉన్నారు అం దులో ఒకడు జిల్లాజడ్జీగారి బంట్రోతు. అతడు మోసెస్‌కో చీటీ యిచ్చాడు, అందులో ఉదయం 7 గంటలకు జడ్జీగారి బంగాళాకి హాజరు కమ్మనివుంది. అతడెళ్లిపోయాడు. రెండోవాడు జిల్లాసర్జన్‌గారి కాంపౌండరు. ఆతడిచ్చిన చీటిలో రేపేవేళనైనా తన్నోసారికలుసు కోవలసిందని వుంది. మూడవవాడు పోలీస్‌సబ్ ఇనస్పెక్టరు. మిమ్మల్ని పోలీసు సూపరెండెంటుగారు ఒకసారి సాయంత్రం 5 గంటలకి తప్ప కుండా కలవమన్నారని చెప్పి వెడలిపోయాడు. మోసెస్ కిది అంతా చూాస్తేవాసంతిక, మధుర సరళలు తనవిషయమై ప్రత్యేకంగా ధీర్ఘ కృషి చేస్తున్నారని గ్రహించాడు.

మోసెస్ ఏమయినా వారంతా జిల్లాఅధికారులే కాబట్టి వెళ్లడము మంచిదనుకొని, పెద్దవుద్యోగస్థుల దగ్గరికి గ్రాడ్యుయేట్సు పోదగిన డ్రెసు—వేసుకొని బయలు దేరాడు. తిన్నగా సూపరెండెంటు బంగాళాకి పోదామని గదిగుమ్మం దిగుతూంటే మోసెస్ జన వెతుకుంటూ బ్రహ్మయ్యనాయు డెదురయ్యాడు. ఒకర్నొకరు చూసి— విస్తుపొయ్యారు. బ్రహ్మయ్యనాయుడు మోసెస్‌ను పలుకరించి లోపలకు దయచెయ్యండని ఆదరణగా అనడంతోనే అతడు గది తెరిచాడు ఇద్దరూ చెరోకుర్చీమీదా కూర్చున్నారు.

మోసెస్‌గారూ! మీవిషయంలో నేను చాలాఅపరాధము చేశాను. నాబిడ్డమీకై పరితపిస్తోంది? నేను సంఘ పిశాచాన్నెదుర్కొని నాబిడ్డను మీకచ్చి బహిరంగంగా వివాహముచేయ నిశ్చయించాను. ముందుగా మీరోసారి సాయంత్రం మాయింటికిదయచెయ్యండి. గతం స్మరింపక నన్ను క్షమించండని రెండుచేతులూ పట్టుకున్నాడు,

మోసెస్ లోపల మహదానందం పొందుతో—చాలా సంతోషం—తప్పక వస్తాను.

అని బ్రహ్మయ్యనాయుణ్ని పంపేసి సూపరెండెంటుని కలిసాడు. ఆయన తనకూతుర్ని పెండ్లిచేసుకోమని నయానా—భయానా చెప్పాడు' ససేమిరా అన్నాడు మోసెస్, శెలవుతీసికొని జిల్లాజడ్జీయింటికొచ్చాడు. ఆయన తనగారాబుబిడ్డనీ ఆస్తినీ అంతా నీపరం చేస్తాను. ఒప్పుకోమని బ్రతిమాలాడు. మోసెస్ .ఆమెపట్ల నిరసన భావం తెలిపి బయటకొచ్చేసాడు. అక్కడనుంచి జిల్లాసర్జనుగారిని కలిసాడు. ఆయన తనముద్దులబిడ్డను పెళ్ళాడితే విదేశాలకిద్దరినీ పంపించి కావలసినచదువు చదివిస్తానని కాళ్లావేళ్లా బడ్డాడు. నాకెంతమాత్రం

ఇష్టంలేదని తిరస్కారభావంతో చరచరా యివతలకొచ్చేసాడు. తిన్న గా శకుంతల యింటికెళ్ళాడు. కానుకా బ్రిహ్మయ్యలతని సాదరపూర్వకంగా లోపలికి తీసికెళ్ళారు శకుంతలను రప్పించి ఫలహారాలు ఏర్పాటుచేసి మరిద్దరు పెద్దమనుష్యులను ఆహ్వానించి వారియెదుట ఏసుప్రభువుసాక్షిగా నాబిడ్డను నీకి పెళ్లిచేస్తానని ఉభయులుచేతులూ కలిపాడు. తథాస్తన్నారు పెద్దమనుష్యులు. శకుంతలా మోసెస్‌ల హృదయపద్మాలు ముకుళించి పరాగకణాలను హాలంతా వెదజిమ్మాయి.

మోసెస్ శకుంతలతో వాసంతిక మధుర సరళలు చేసిన పన్నాగాలన్నీ చెప్పాడు. వారెంత పెద్దయుద్యోగస్తులైనా వారివల్ల మన కేమీ భయంలేదని ధైర్యంచెప్పి సానందంగా తనబసకొచ్చేసాడు

పోలీసు సూపరెంటెండెంటు— కలెక్టర్— కలెక్టర్సను— తనబిడ్డల్ని ఆతని ఆశ వదలుకోమని మందలించారు. అంతకన్నా గొప్పవాణ్ని తీసుకొస్తామని బుజ్జగించారు,

మరునాడు ఆడవాళ్ళక్లబ్బులో వాసంతిక—మధుర—సరళ—శకుంతల—కలుసుకున్నారు శకుంతల వారికెంతదూరంగా తప్పించుకు వాడిగితిరిగినా—వారే పూసుగొచ్చి— శకుంతలను— ఆప్యాయంగా— ఓగదిలోకి తీసికెళ్లారు, అదివరకే తమకందిన శకుంతలా మోసెస్‌ల పెండ్లిశుభలేఖలు బయటకు దీసి అసూయతో—

అంతా సిద్ధమయిందా అంది—వాసంతిక,

మంచిఛాన్సే కొట్టావంది—మధుర,

పెళ్లెలాజరుగుతుందో చూస్తాను— నువ్వేమన్నా లైసెన్సు కట్టావా అతని కంది—సరళ

శకుంతల వారిమాటల్లోని అసూయతను కనిపెట్టి వాళ్ళకు బుద్ధిచెప్పాలని—వాసంతికా—ఎందుకింత కపటకేళిను సలిపిస్తావు? మధురా—అలా అసూయాగరళం వెడలగ్రక్కుతా వెందుకూ? సరళా

కళ్లల్లో కారం జల్లుకుంటూ వేం- లైసెన్సు కట్టావా అని ధీమాగా అడుగుతున్నావు నేనే గదా పోలీసు సూపరెండెంటు కూతుర్నని.

ఆ- అతనికి- లైసెన్సు కట్టేను. ఆతడు—నాకు—

"లైసెన్సు మగడు"

అంటూ కిల్లున్నవ్వు విడచి యింటికొచ్చేసింది. వాసంతిక మధుర సరళలు మొగాలు చిన్నబుచ్చుకొని యిండ్లకెళ్లిపోయారు.

ఆనాడు- బ్రిహ్మసమాజమందిరంలో—

శకుంతలా మోసెస్‌ల వివాహం—

అతివైభవంగా జరిగింది—

సంపూర్ణం.



---

త్వరలో

# మల్లాదివారి రాబోవు

## క్రొత్తనవలలు—

1 ఆడదాంపత్యం

2 మగదాంపత్యం

3 డేక్వీన్